Photo by Ambalal M. Patel



బహుమతి పొందిన వ్యాఖ్య

ఉదకనిమిత్తం

పంపినవారు:
నప్పినీసు శ్రీనివాసరావు, కర్నూలు







: డిస్ట్రిబ్యూటర్సు :

ఆంధ్ర : జనతాపిక్చర్సు, విజయవాడ. | నైజాం : సుందర్ పిక్చర్సు రిలీజ్, సికింద్రాబాద్.
సీడెడ్ : భవానీ పిక్చర్సు, విజయవాడ. | మైసూర్: విజయాటాకీ డిస్ట్రిబ్యూటర్సు, బెంగుళూరు.

వివరాలకు : పీపుల్స్ ఆర్టు ప్రొడక్షన్సు, 1/1. అరులమ్మాళ్ స్ట్రీట్, మద్రాసు - 17.

త్వరలో వస్తూంది!

విజ్ఞాన వినోదాలను
ఉత్తమ స్థాయిలో
అందించు



శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీ వారి

# పెద్ద రైతు

దర్శకత్వం.. కె.బి.నాగభూషణం
అసోసియేట్.. ఇంటూరి

అంజలీదేవి
కన్నాంబ
శ్రీరామమూర్తి
లింగమూర్తి.. రేలంగి



చమ్రియా రిలీజ్




## పిల్లలందరూ కోరేవి!

# పెలికన్ టూఫీలు

గ్లూకోస్, పాలు మీగడ, పంచదార విటమిన్లతో తయారు చేయ బడినవి..........

PUBLICITY Arts

ఆంధ్ర, నైజామ్స్ & ఒరిస్సాలో ఏజంట్లు: **టెరిటోరియల్ ఏజన్సీస్,** విజయవాడ.

బ్రాంచి: తిమ్మన్న చెర్ల (R. S. గుంతకల్లు)

# చందూ యొక్క సాహసకృత్యములు




















## ఈ సంచికలో యివి చదువుకోండి



ఇవన్నీగాక ఇంద్రజాలం, ఫోటో వ్యాఖ్యలపోటీ
ఆకర్షవంతమైన మరికొన్ని క్రొత్తశీర్షికలు వున్నై.

# చందమామ

సంచాలకుడు :: చక్రపాణి

సంపుటి 11 : అక్టోబర్ 1952 : సంచిక 4

---

పూర్వకాలపు కవులకు వాక్శుద్ధి కలదని చెప్పటానికి అనేక నిదర్శనాలున్నాయి. ఒక్క పద్యం చెప్పి వారు రాజ్యాలను రక్షించగలిగేవారు. ఒక్క నోటివాక్యంతో మహాసామ్రాజ్యాలను నేలమట్టం చేయగలిగేవారు. అంతటి ప్రతిభావంతులు గనకనే నిరంకుశులుగా రాణించారు. తమ కవితను వెల్లడించటంలో ఏపాటి ఆటంకం కలిగినా, వారు బ్రహ్మరుద్రులనైనా లక్ష్య పెట్టలేదు. అక్షరలక్షలనుసైతం తృణప్రాయంగా తోసిపుచ్చారు. అందుచేతనే, మునుపు కవీశ్వరులను ముందుగా పూజించటం ప్రభువులకు ఆచారంగా ఏర్పడింది. కవులకు ఎక్కడ కోపంవచ్చిపోతుందోనని ఏ లోపమూ రాకుండా చూడటం ప్రభువులు విధిగా పెట్టుకొనేవారు. లోపం ఉన్నా, సర్దిపుచ్చుకోవటానికి వారు అత్రంచూపేవారు. ఈ సంచికలోని 'కవిపూజ' కథ ఇటువంటిదే ఒక కవిజీవితంలోని హృదయం కలచివైచే సంఘటనను వ్యక్తపరుస్తున్నది.



# గుండ్రమా? చదరమా?





పల్లెటూరి బడిపంతులుగా రొక
రోజు క్లాసులో అన్నారు—
'పిల్లల్లార! వినండందరు ఒక
ముఖ్యమైన విషయం మీరు.

స్కూళ్ల ఇనస్పెక్టరుగా రీ నెల
మన స్కూలుకి వేంచేస్తారు.
మిమ్మలినందరినీ వారప్పుడు
ఎన్నో ప్రశ్నలు వేస్తారు.

మచ్చుకి భూగోళం ప్రశ్నయితే
'భూమి ఎలా ఉందం'టారు?
తెల్లపోయి చూస్తారా అందరు?
అప్పుడు మీరేమంటారు?

చూపండంతా ఈవైపుకు, నా
పొడుంకాయ ఎట్లా ఉంది?
ఇంతే, భూమికూడ గుండ్రంగా
పొడుంకాయలా గుంటుంది'

అని పంతులుగా రంతట నాటికి
ఉపదేశం చాలించారు.
పిల్లలు పంతులు చెప్పిందంతా
శ్రద్ధపూని అలించారు.

పొడుంకాయ సంగతి ముఖ్యంగా
వారి మనసులో నాటింది.
'ఈ ప్రశ్నే వేస్తే దంచేస్తాం',
అని క్లాసంతా అనుకొంది.

అయితే పంతులుగారు మరచినది
ఉంది ముఖ్యవిషయం ఒకటి :
రెండు పాడుంకాయలు అయనివే,
'చదరపు దొకటి, గుండ్రదొకటి.'

బడి ఉంటే గుండ్రది, లేకుంటే
చదరపుదే వాడేవాడు.
పిల్లల కిది గుర్తున్నది, పాపం
పంతులుమాత్రం మరిచాడు.

సరే, ఇనస్పెక్టరుగా రికనేం
ఆ స్కూలుకి వేంచేశారు.
క్లాసులోకి రాగానే పిల్లలు
లేచి వందనంచేశారు.

పంతులు ప్రక్కన నిలచిఉండ ఇటు
తిరిగి ఇనస్పెక్టరుగారు—
'భూమి ఎలావుంటుందబ్బాయ'ని
అనుకొన్నట్లే అడిగారు.

అప్పుడు ఒక పిల్లాడు చటుక్కున
లేచి—'స్కూలువుంటే నాడు
గుండ్రంగా, లేకుంటే చదరం
గా ఉంటుంద'ని అన్నాడు.

పంతులు ముఖంకేసి చూచారిక
మండి ఇనస్పెక్టరుగారు.
అతడు క్రుంగిపోయాడు నిలువునా,
పిల్లలు గొల్లున నవ్వారు.







రచన : "బైరాగి"



1



2



3



4



5



6



7



8



9

ఇక్కడ తొమ్మిది బొమ్మలున్నవి. వీటిల్లో ప్రతి బొమ్మలోనూ మా చిత్రకారుడు ఒక్కొక్క విధమైన తప్పు చేసివున్నాడు. ఆ తప్పులేమిటో మీరు పట్టగలరా?

సరిఅయిన జవాబులకు వచ్చేనెల చందమామ చూడండి.



# పగటివేషగాడు



వేమగిరిలో వెంగళాచార్యులు పగటి వేష గాడు. వట్టి అమాయకుడు. అతని తండ్రీ, తాతా పగటివేషాలలో ప్రజ్ఞ కనపరిచి రాజుగారి మెప్పు పొంది, నాలుగెకరాల భూమి ఇనాముగా సంపాదించారు. వెంగళా చార్యులకు విగ్రహపుష్టేగాని విద్యలేదు. వేషాలువేసి మెప్పించటం అసలే చేతకాదు.

కాని అతని కొడుకు మంగాచార్యులు మాత్రం చాలా తెలివైన వాడయాడు. కొడుకు సంపాదించి తెస్తూవుంటే వెంగళా చార్యులు భోజనంచేసి కూర్చునేవాడు.

'అలా కూర్చోకపోతే, వెళ్లి రాజుగారి దర్శనం చేసుకుని, "ప్రభూ, ఇంట్లో పిల్లల పాలకి మహా ఇబ్బందిగా వున్నది; ఒక్క పాడి గేదెను ఇప్పించ'మని అడిగి తీసుకు రాకూడదా ?" అంది భార్య.

అతడు ప్రభువుగారి దర్శనంచేసి, భార్య చెప్పినట్లే అడిగేడు. అప్పుడు రాజు 'సరే ఆచారీ! మామందలోకి వెళ్లి మీకు నచ్చిన పశువును తోలుకుపొండి' అన్నారు.

వెంటనే వెంగళాచార్యులు మంద వద్దకు పోయి కంటికి నదరుగా కనపడ్డ గొడ్డు నొకదాన్ని ఎన్నుకొని, దాన్ని ఇంటికి తోలుకు పోయాడు. గుమ్మంలో అడుగుపెట్టగానే, భార్య బ్రహ్మానందంతో బయటకువచ్చి చూసింది. "ఇదేమిటండీ, నేను పాలగేదె తీసుకురమ్మంటే దున్నపోతు తీసుకొచ్చారే!" అని నానామాటలతో దుమ్మెత్తిపోసింది. ఆచారి వణికిపోతూ "అలాగునా? నాకు తెలిసిందికాదు మరి. ఇప్పుడు ఏంచేసేది?" అని అమాయికంగా అడిగాడు.

ఆమె ఉగ్రురాలై "మేత దండుగ. తక్ష ణమే తీసుకుపోయి ఎక్కడో అక్కడ అమ్మేసి సొమ్ము తీసుకరండి" అంది. బతుకుజీవుడా అనుకొని అతడు ఆ దున్నను సంతకు తోలుకుపోయాడు.

యం. శోభనాద్రి - బుషివాలీ



దారిలో అచార్యులవారికి ఇదరు దొంగలు ఎదురయ్యారు. ఆయన అమాయకుడని ఇట్టే కనిపెట్టేశారు.

'దీన్ని అమ్మటానికై తే సంతదాకా ఎందుకయ్యా. నేనే కొంటాను' అన్నాడు దొంగలలో పెద్దవాడు. అంటూ, 'ఎంతండి దీని ఖరీదు?' అని అడిగాడు. అందుకు అయన 'నాకు తెలవదు' అని నిజంచెప్పేశాడు. అప్పుడు వాళ్లు బాగా ఆలోచించారు. 'బాబయ్యా!—ఖరీదు కట్టడంలో మానాన్న గట్టివాడు. అక్కడికి పోదాం రండి' అన్నాడు దొంగలలో అన్న. తమ్ముడు దున్నపోతును తోలుకుపోతూవుంటే వాడి వెనకాలే అన్న ఆచార్యులవారితో సహా ఇంటికి వెళ్ళేడు.

రెండువందల రూపాయలు చేసే దున్నపోతు అది. ఆ దొంగలతండ్రి, 'దీనికి నాలుగు రూపాయలకన్న ఎక్కువెందుకూ?' అన్నాడు. పెద్దవాడు నాలుగురూపాయలూ అచార్యులవారి చేతిలో వేశాడు. ఆ నాలుగు రూపాయలూ పుచ్చుకుని అయన తనదారిని పోబోతూంటే, వాడే మళ్ళీ వెనక్కి పిలిచి 'అగవయ్యా. సంతదాకా వెళ్లక్కర్లేకుండా వ్యవహారం ఇక్కడే తెమిల్చేశానుకదా. మరి, నా బహుమానం ఏదీ?' అన్నాడు.

అయన ఒక రూపాయి ఇచ్చి, పోతూవుండగా దొంగలలో తమ్ముడు ఆయనను ఆపి, 'అయ్యా, దున్నపోతును ఇక్కడిదాకా తోలుకొచ్చానుకదా, నాకు మరేమీ యివ్వకుండా వెళ్ళిపోతారా?' అన్నాడు.

వాడికీ ఒక రూపాయి ఇచ్చి వెనక్కి తిరిగేసరికి ఆ దొంగలతండ్రి, 'మీ దున్నపోతుకి విలువగట్టిన నాకు ఏమీలేదా స్వామీ?' అన్నాడు. అప్పుడు ఆచారి మిగిలిన రెండురూపాయలూ ఆ ముసిలివాడి చేతిలో పడేసి, ఉత్తి చేతు లూపుకొంటూ ఇంటికి చేరుకున్నాడు.



ఆచారిగారి భార్య, భర్తదగ్గిరకు వచ్చి 'ఏదండీ సామ్మి ?' అని ఆత్రంతో అడిగే సరికి ఆయన జరిగినసంగతి చెప్పాడు. చెప్పగానే ఆమె లబోలబోమంటూ 'ఎంత వెర్రివాళ్ళండీ ! ఎంత అమాయకులండీ !' అని గోలపెట్టింది.

కొడుకు మంగాచారి ఇంటికొచ్చి 'ఎందుకమ్మా విచారిస్తున్నావు ?' అని అడిగి, సంగతంతా తెలుసుకున్నాడు. తండ్రితో వెళ్లి ఆయనను మోసంచేసిన ఆ దొంగల ఇల్లు ఎక్కడుందో కనుక్కొచ్చాడు. మంగాచారికి వేషాలువేసుకోడం బాగాతెలుసుకదా. కనక ఒక ఆడవేషం వేసుకుని కూచుని, ఆడ గొంతుకతో ఆ దొంగలు వచ్చే దారిలో 'అయ్యో నా మొగుడు ! అయ్యో నా మొగుడు !' అని రాగాలుపెట్టసాగాడు.

అనుకున్నట్టుగానే దొంగలలో తమ్ముడు ఆదారిన వస్తూ ఆమెనుచూసి, 'ఏం అమ్మీ? ఎందుకూ ఏడుస్తున్నావు ?' అని అడిగేడు.

మంగాచారి ఆడగొంతుకతోనే, 'నా మొగుణ్ణి పులి ఎత్తుకుపోయింది ! ఇంక నా గతేంగాను ? నాకింక ఎవరుదిక్కు ?' అని గగ్గోలుపెట్టి ఏడవసాగాడు. అప్పుడు దొంగ ఆమెను ఓదారుస్తూ, 'పోయినవాడికోసం యేడ్చి యేంలాభం ? నిన్ను నేను పెళ్ళి చేసుకుంటాను. నడు; నిన్ను సమస్తమైన సౌఖ్యాలలోనూ ముంచెత్తుతాను' అంటూ ఆమెను ఊరించాడు. మేలిముసుగు తియ్యకుండానే మంగాచారి వాడివెంట నడిచి వెళ్ళేసరికి, వాళ్ళ అన్న ఎదురై, 'ఈ పిల్ల ఎవరురా ?' అన్నాడు.

వాడు సంగతంతా చెప్పి, 'నా పెళ్లాంరా!' అన్నాడు గర్వంతో. అందుకు అన్న 'ఏడిసినట్టే వుంది ! నాకింతవరకూ పెళ్ళి పెటాకులూ లేదే, ముందు నీకు పెళ్లేమిట్రా ? ఈపిల్లను నేనే పెళ్లాడతాను !' అని తమ్ముడితో తగవు పెట్టుకున్నాడు.

ఇంటికి చేరుకున్నాక వాళ్ళు తండ్రితో సంగతి అంతా చెప్పేసరికి ఆ ముసిలివాడు 'అబ్బాయిలూ!— మీ అమ్మ చనిపోయి నప్పట్నుంచీ నేను మళ్ళీపెళ్లి చేసుకుందా మంటే కుదిరిందికాదు. ఈ పిల్లను నేనే పెళ్లాడతాను. ఏర్పాట్లు చేయండి' అని తొందరపెట్టాడు. అంతలో మంగాచారి ఆడ గొంతుకలోనే, 'అయ్యో నామతి మండి పోనూ!' అన్నాడు.

'ఏం?' అన్నారు దొంగలూ, తండ్రీ విస్తు పోయి' అడివిలో పెద్దపులి నామొగుణ్ణి లాక్కు పోవటంతో, దొంగలు దోచుకుంటారేమో నన్న భయంకొద్దీ నగలన్నీ మూటకట్టి రోడ్డు పక్క పొదలో దాచాను. మీరిద్దరూ వెళ్లి ఆ మూట పట్టుకురండి. నగలులేకుండా పెళ్లే మిటి, నలుగురూ నవ్విపోరా?' అన్నాడు ఆడవేషంలోని ఆచారి. వాళ్లిద్దరూ ఉరక లేసికొంటూ ఆచారిచెప్పిన దిశకుపోయారు. వాళ్ళు దూరంగా పోయేవరకూ ఆగి, మంగాచారి తన మేలిముసుగు తీసేశాడు. ముసిలివాడు ఆశ్చర్యపోయాడు. 'నువ్వు పెళ్ళికూతురివని అనుకున్నాను...!' అని ఇంకా ఏదో అనబోయేసరికల్లా మంగాచారి మూలనున్న దుడ్డుకర్ర ఒకటి దొరకబుచ్చు కుని, 'పెళ్ళికూతుర్నికాదయ్యా తాతా! పౌరోహిత్యుణ్ణి!! ఇదుగో ఇదే పెళ్లికూతురు! దీనితో నీకు పెళ్ళిచేస్తా' అంటూ ఆ కర్రతో ముసిలివాణ్ణి బడితబాజా పట్టించాడు. ముసిలివాడు, 'బాబోయ్, అమ్మోయ్! చచ్చి పోతాను. కొట్టకోయ్' అని మొత్తుకున్నాడు.

'ఇన్నాళ్లనుంచీ దారులుకొట్టి, దోచుకొనీ, ప్రజల్ని మోసంచేసి గడించిన ధనమూ, నగలూ ఎక్కడున్నాయో చెప్పు! చెప్పక పోతే మళ్ళీ తంతా!' నన్నాడు మంగాచారి.

భయంకొద్దీ ముసిలివాడు, సొమ్మంతా మూటకట్టి తెచ్చి ఆచారికి సమర్పించాడు. ముసిలివాడి కొడుకులు తిరిగిరాకుండా ఆ మూటతో మంగాచారి ఉడాయించాడు.






## 10

[ఆలయంలో పులులూ సింహాలూ మీదికిరాగా శక్తిసింహుడు పారిపోవటం, మంత్రి తారసపడి దేవసింహునిదగ్గర చేరుకోవటం, వైద్యుని పరిస్థితి క్లిష్టంకావటం, వైద్యుడికి పక్షిరూపంలో వృద్ధురాలు కనిపించటం, అది ఆలయానికిపోయి శక్తిసింహుణ్ణీ వైద్యుణ్ణీ కలియటం, దేవసింహుడినిగురించి యోచనచేయటంవరకూ చదివారుకదా ?—తర్వాత]

ఆలయంలోకి వెళ్ళిన వృద్ధురాలు దేవసింహుడికోసం వెతికి, వాడు కనపడక పోయేసరికి, బయటకు వచ్చేసింది. ఆమె ఎప్పుడు బయటకు వస్తుందా, అని ఎదురు చూస్తున్న శక్తిసింహుడూ, వైద్యుడూ ఆమె రావటం గమనించి, ఆమెవద్దకు పోబో యారు. కాని వృద్ధురాలు వారిని గమనించ నట్టే సాగిపోయింది. పైగా రివ్వున ఆకాశ మార్గాన ఎగిరిపోయింది. శక్తిసింహుడూ, వైద్యుడూ నిస్తబ్ధులైపోయారు.

దిగువని ఒకచోట దేవసింహుడితోసహా మంత్రి కనుపించాడు వృద్ధురాలికి. ఆమె క్రిందకు దిగివచ్చి మంత్రివంక, దేవసింహుడివంక తేరిపారచూచింది. ఆమె చూపుల అర్థం గ్రహించాడు మంత్రి.

అప్పుడు వృద్ధురాలు, "నేను ఎన్ని విధాల రక్షించాలని ప్రయత్నించినా ఫలితం లేకుండా పోయిందే అని భయపడ్డాను. ఆ శక్తిసింహుడిచేతిలోనే పడితే కుర్రవాడు ఏమయ్యేవాడో! వాడిని పట్టాలని వాళ్లు అన్ని ప్రవేశాలూ గాలిస్తున్నారు. కనుక జాగ్రత్తగా వుండాలి. అందుకు అపూర్వసౌధం కంటే సురక్షితమైన చోటు మరిలేదు. నాతో రండి. మిమ్మల్ని అక్కడ చేరుస్తా" అన్నది.



"ఆమె కోసం ఎదురుచూచి ప్రయోజనం లేదు. వెతకాలంటే ఓపిక లేదు. కనుక నాదారిన నన్ను పోనివ్వండి. ఏనాటికైనా దేవసింహుడిజాడ తెలుసుకుని అతడి రాజ్యం అతడికి వప్పచెప్పేభారం మీదే" అంటూ, వైద్యుడివద్ద సెలవుకోరాడు.

వైద్యుడు ఎన్నో విధాల నచ్చచెప్పాడు. నిరుత్సాహ పడవద్దన్నాడు. కాని శక్తి సింహుడు వినేధోరణిలో లేడు.

"క్షమించండి. మీ కోరికను మన్నించ లేను. జీవితశేషం నిశ్చింతగా జరిగిపోయే టట్టుమాత్రం ఆశీర్వదించండి. అంతే," అని ప్రాధేయపడ్డాడు. అతికష్టంతో వైద్యుడు శక్తిసింహుడిని సాగనంపాడు.

ఇప్పుడు వైద్యుడు ఏకాకి ఐపోయాడు. తను ఎక్కడికి పోవాలో, ఏమి చెయ్యాలో ఏమీ పాలుపోయిందికాదు. అందుచేత లక్ష్యంలేకుండా రాత్రనక పగలనక కాలి నడకని అలా సాగిపోతూనేవున్నాడు.

అందుకు మంత్రి, ఆత్రంతో "ఇంకా యిలా ఎంతకాలం? మా తల్లి దేవప్రియ ఏమైంది? శక్తిసింహుడి సంగతి అటోయిటో తేల్చుకోనటం మంచిదికదా," అన్నాడు.

"తొందరపాటు పనికిరాదు. అతడే దారికి వస్తాడు. అప్పటివరకూ మనం కుర్ర వాడిని రక్షించాలి" అన్నది వృద్ధురాలు.

కాదనలేకపోయాడు మంత్రి. అతడూ, దేవసింహుడూ వృద్ధురాలితో బయల్దేరారు.

అక్కడ శక్తిసింహుడూ, వైద్యుడూ ఏమైనారో చూదాం:

తిరిగి వృద్ధురాలు వస్తుందేమోనని చూచి చూచి, శక్తిసింహుడు నిరాశచెందాడు.

*　*　*

విధీవిరామంలేకుండా శక్తిసింహుడుకూడా ఏకబిగిని సాగిపోతునేవున్నాడు. పోయిపోయి అతడు కొన్నాళ్ళకు ఒక మహారణ్యం చేరు కున్నాడు. తిండీ నిద్రా లేక, నడుస్తున్న




వాడు నడుస్తున్నట్టుగానే ఆ అరణ్య మధ్యంలో స్పృహతప్పి పడిపోయాడు.

ఎంతసేపు పడివున్నాడో తెలియదు. తిరిగి స్పృహవచ్చి కళ్ళుతెరిచి చూచేసరికి ఒక చిన్న కుటీరంలో వున్నాడు. ప్రక్కని ఒక పండువృద్ధు కూర్చునివున్నాడు.

శక్తిసింహుడు కళ్ళు తెరవగానే ఆ వృద్ధుడు ఒక కమండలువుతో నీరుతెచ్చి శక్తిసింహుడికి అందించాడు. అది పుచ్చుకోగానే శక్తిసింహుడు తేరుకున్నాడు. తేరుకుంటూనే, "స్వామీ, తమరెవరో నన్ను రక్షింపవచ్చిన దేవదూతలు. తమ కుటీరంలోకి నేను ఎలావచ్చాను స్వామీ!" అని ఆశ్చర్యంతో అడిగాడు.

అందుకు వృద్ధుడు "ఆపదలో నున్న వారిని ఆదుకొనటమే నా ధర్మం. ఈ అడవిలో పశు పక్ష్యాదులే నాకు తోడునీడలు. ఈ నిర్జనప్రదేశంలో మీవంటి దీనుల చరిత్ర నాకు వాటివల్లనే తెలిసివస్తుంది. చేతనైన సహాయంచేసి కృతార్థుడ నవుతుంటాను. ఇంతకూ తమరెవరో...?" అన్నాడు.

"స్వామీ! నేనొక నిర్భాగ్యుడను. అమాయకులను అగచాట్లుపాలు చేసినందుకు శిక్ష అనుభవిస్తున్న మహాపాపిని. మహాత్ములను సేవించుకుంటూ జీవితశేషం వెళ్లబుచ్చాలనే యిలా బయల్దేరాను" అని బదులు చెప్పాడు శక్తిసింహుడు.

అప్పుడు వృద్ధుడు 'నావల్ల కాదగిన సహాయం చేయటానికి యత్నిస్తాను' అని అభయమిచ్చాడు.

అంతట శక్తిసింహుడు తన జీవిత వృత్తాంతం అంతా ఉన్నది వున్నట్టు మహాత్మునికి విన్నవించుకున్నాడు. అంతా విని వృద్ధుడు, "పాపంచెయ్యని జీవి ఎవరు! ఈ ప్రపంచంలో ప్రతిజీవీ పాపంచేస్తూనే వుంటాడు. అయితే చేసినపాపానికి పశ్చాత్తాపమే పరిహారం. ఇప్పుడు మీరు పొందు




తున్న పశ్చాత్తాపమే మీ పాపాలకు పరిహారమైంది. కనుక గతాన్ని మరచిపోయి తిరిగి మీ మేనల్లుడి జాడ తెలుసుకునేందుకు శాయశక్తులా యత్నించండి. అదీకాక, దారాపుత్రాదులను వారి కర్మానికి వారిని వదిలి ఇలా సన్యసించబూనటానికి శాస్త్రం వప్పదు. మీ ప్రయత్నాలలో అటంకాలు కలగకుండా మీకు జయం కోరేందుకుగాను ఈ మంత్రం పఠిస్తూవుండండి" అంటూ వృద్ధుడు శక్తిసింహుడికి మంత్రం ఏదో ఉపదేశంచేశాడు.

తర్వాత శక్తిసింహుడు దేవసింహునిజాడ వెతుక్కుంటూ తిరిగి బయలుదేరాడు.

అలా తిరుగుతూ అతడు కొన్నాళ్లకి ఒక రాజ్యం చేరుకొన్నాడు. నగరపు నడివీథిలో ఒక పెద్ద పిల్లలగుంపు చేరివుంది. ఏమిటి చెప్మా అని దగ్గరకు వెళ్ళిచూడగా ఒక పిచ్చివానిచుట్టూ వాళ్లు గుమికూడి అతడిని వేళాకోళం చేస్తున్నారు.

శక్తిసింహుడు ఆ కుర్రవాళ్లను వారించి, ఆ పిచ్చివానిని తనతోపాటు తీసుకొని సాగిపోయాడు. ఆ పిచ్చివాడు మధ్య మధ్య "ముసిలిది ఎక్కడ? ముసిలిది ముక్కా చెక్కలు అయిందా" అంటూవున్నాడు.

"ఎవరా ముసిలిది?" అని శక్తిసింహుడు ప్రశ్నించినప్పటికీ అతనికి సరియైన జవాబు రాలేదు.

ఆ పిచ్చివాని చరిత్ర తెలుసుకోవాలని శక్తిసింహుడు ఎంతగానో యత్నించాడుగాని ఏమాత్రం తెలిసిందికాదు. అయితే ఆ పిచ్చివాడు శక్తిసింహుడిని వదలక అతని వెంట ఉంటూనేవచ్చాడు.

వాళ్లు ఆ రాజ్యం వదిలి మరికొద్ది రోజులకు ఒకగ్రామం చేరుకున్నారు. అక్కడ ఒక చెరువుగట్టున పెద్దగుంపు పోగైవున్నది. ఇద్దరు కుర్రవాళ్లు గారడిచేస్తున్నారు. చెరువుగట్టున రెండుగెడలు పాతివున్నై. వాటి

మధ్యని తీగ కట్టివుంది. ఒక కుర్రవాడు తీగ ఒక చివరినుంచి రెండోచివరకు చరచర నడిచిపోయాడు. జనం సంతోషం పట్టలేక చప్పట్లు చరిచారు.

శక్తిసింహుడితోకూడా వున్న ఆ పిచ్చివాడుకూడా పెద్దపెట్టున నవ్వుతూ ఒక్క పరుగున వెళ్ళి గెడపైకి ఎగబ్రాకాడు. తీగె పైకిఎక్కి కోతిలా వేలాడసాగాడు. ఇదిచూచి జనం, "ఎవడువాడు? లాగండి కిందికి" అని అరిచారు. వాళ్లు యిట్లా అనకముందే అంతకుముందు గారడీచేస్తున్న ఆ కుర్రవాళ్ళు ఆ పిచ్చివాడిని కాళ్లు పట్టుకుని చరచరా క్రిందికి యీడ్చారు.

తర్వాత గారడీకుర్రవాళ్లు జోలెలు చేత బుచ్చుకుని చుట్టూచేరిన జనందగ్గర అడుక్కోసాగారు. అలా అడుక్కుంటూ వాళ్లు శక్తిసింహుడివద్దకుకూడా వచ్చి జోలె తెరిచారు. శక్తిసింహుడు జలజలకన్నీరు కార్చాడు. ఇదిచూచి ఆ కుర్రవాళ్ళు విస్తుపోయారు. "ధర్మం చేయకపోతేపోయె ఈమనిషి ఏడుస్తాడెందుకు చెప్మా?" అని జాలి కలిగింది.

"నీబాధ మేము గ్రహించాం. మాతో పాటు రా. మేము సంపాదించేదాంట్లోనే



నీకూ కలో గంజో పోస్తాము" అన్నారు ఆ కుర్రవాళ్ళు.

అందుకు శక్తిసింహుడు, "నేనొక్కడినే కాదు. పాపం ఈ పిచ్చివానినికూడా పోషించాలి. మీవలన ఏమవుతుంది? కనుక మా దారిని పోనివ్వండి" అంటూ తిరిగి కన్నీరు కార్చాడు.

ఇది చూచేసరికి ఆ కుర్రవాళ్ళ హృదయాలు మరింత ద్రవించినై. "ఫరవాలేదు. మీ యిద్దరూ రండి మాతో. మేము నేర్చిన విద్యలు మీకూ నేర్పుతాం. కొన్నాళ్ళయాక మీరే మమ్మల్ని పోషించగలుగుతారు" అంటూ ఓదార్చి వాళ్ళను తమతోపాటు



తీసుకుని ఆ గ్రామంనుండి మరొక గ్రామానికి బయలుదేరారు.

*　　*　　*

ఇక అక్కడ ఏకాకిఅయిన వైద్యుడు కొంత కాలం విధీవిరామంలేకుండా ఎన్నోరాజ్యాలు దాటిపోతూనే వున్నాడు. కాని ఎక్కడా మంత్రిజాడకానీ, దేవసింహుని జాడకానీ తెలిసిరాలేదు.

అయితే అలా మరికొంతకాలం పోగా పోగా అతడు శక్తిసింహుడి పరివారాన్ని కలుసుకోవటం సంభవించింది. ఇప్పుడు శక్తిసింహుడి అవతారం పూర్తిగా మారింది. అతడు ఒక గారడివానివేషంలో వున్నాడు. అతనిని వైద్యుడు గుర్తుపట్టలేదు కాని శక్తిసింహుడు వైద్యుడిని యిట్టే గుర్తుపట్టాడు.

గుర్తుపడుతూనే, "తమరిక్కడి కెలా వచ్చారు? ఏమైనా అచూకీ చిక్కిందా?" అని ప్రశ్నించాడు. వైద్యుడివద్దనుండి ఏమీ సమాధానం రాకపోవటంతో శక్తిసింహుడు పరిస్థితి గ్రహించాడు. అప్పుడు శక్తిసింహుడు తనతో వున్న ఆ కుర్రవాళ్లని పరిచయం చేస్తూ, "తెగిపోయిన గాలిపటంలా తిరుగుతున్న నన్ను ఈ అర్భకులు ఆదరించి పోషించారు. లేకుంటే ఈ గుప్పెడు ప్రాణాలూ ఏనాడో ఎగిరిపోయేవి. పోతే, మీరుమాత్రం ఒంటిపాటుగా ఎక్కడని కాలక్షేపంచేస్తారు? మాతోపాటు వచ్చెయ్యండి" అని కోరాడు.

కోరికను నిరాకరించి చేసేదేముంది? సరేనన్నాడు వైద్యుడు. నాటినుండీ వైద్యుడు శక్తిసింహుడి పరివారంతోపాటు వుంటూ, వాళ్లువెళ్లిన చోటుకెల్లా వెడుతూ, వాళ్లకి అండగా వుంటున్నాడు.

ఈ పరివారం ఎన్నోదేశాలు పర్యటిస్తూ చివరకు అపూర్వసౌధం దరిదాపులకు చేరుకున్నారు. అంతకుముందుగా పరిచయమైన చోటే కనుక, భవనం కంటబడేసరి

కల్లా వైద్యుడు ఉప్పొంగిపోయాడు. ఆ సౌధంముందర గారడీ ఏర్పాటుచేశారు.

వాళ్ల సందడి చెవినిపడటంతో లోపల వున్న మంత్రీ, దేవసింహుడూ భవనంపై నుండి క్రిందికి తొంగిచూచారు. గారడీ వాళ్ల వింతలుచూచి దేవసింహుడు ఆనంద భరితుడయాడు. క్రిందకు వెళ్లతానన్నాడు. పసివాని కోరిక నిరాకరించలేక, మంత్రి వాడిని ఎత్తుకుని క్రిందకు దిగివచ్చాడు.

ప్రదర్శనంలో మునిగివున్న కుర్రవాళ్ళు మొదట దేవసింహుడి రాక గమనించనే లేదు. కాని కొద్దిసేపటికల్లా దేవసింహుడు వాళ్లకంట పడగానే, ప్రదర్శనం చాలించి ఒక్కపరుగున వానిదగ్గరకు వెళ్ళారు. "ఎవరు? మా దేవసింహుడే!" అంటూ వానిని చుట్టుముట్టారు.

శక్తిసింహుడూ, వైద్యుడూ ఆశ్చర్య పోయారు. "ఈ గారడీకుర్రవాళ్లకీ దేవ సింహుడికీ ఏమిటి సంబంధం? ఇంతకీ ఈ కుర్రవాళ్లు ఎవరు!" అని ఆందోళనచెందారు.

ఇంతలో ఆ కుర్రవాళ్ళు దేవసింహుడిని శక్తిసింహుడికి చూపుతూ, "మాతండ్రి ఈ చిన్నవాడి ప్రాణాలు బలికొన్నాడని మా రాజ్యంలో అంతా అనుకుంటున్నారు. తెలిసి



చేశాడో తెలియక చేశాడో, మాతండ్రి..." అని యింకా ఏమో అనబోతుండగా శక్తి సింహుడు స్పృహతప్పి పడిపోయాడు.

కొద్దిసేపటికల్లా శక్తిసింహుడు తేరు కున్నాడు. తనను యిన్నాళ్ళూ పోషిస్తున్న ఆ కుర్రవాళ్లు తన కొమారులేననీ, ఆ పిచ్చి కుర్రవాడు తన అల్లుడేననీ తెలిసింది.

వాళ్లని దగ్గరకుతీసి శక్తిసింహుడు భోరున ఏడ్చాడు. ఇంతలో ఎక్కడినుండి వచ్చిందో వృద్ధురాలూ రానే వచ్చింది. వస్తూనే పరి స్థితి అంతా గ్రహించింది. ఆమె శక్తిసింహు డిని దగ్గరకు పిలిచి, "ఇక మీరు మీ రాజ్యానికి వెళ్లండి. పట్టాభిషేకానికి

ఏర్పాట్లు చూడండి. చిన్నారి దేవసింహుడితో నేనూ చేరుకుంటాను" అన్నది.

అయితే దేవసింహుడు వెళ్ళేందుకు సిద్ధపడలేదు. 'నన్ను ఇక్కడనే ఉండనివ్వండి. నాబదులు ఈ కుర్రవాళ్ళలో ఎవరికైనా పట్టాభిషేకం చెయ్యండి. ఇంతకాలం ప్రజలను కాపాడలేక అజ్ఞాతంలో వుండి ఈనాడు వెళ్లి ప్రజలకంట పడలేను. అదీకాక ఈ అవిటికాలుతో నేను రాజ్యపాలన చేయగలిగేదేమున్నది" అన్నాడు.

శక్తిసింహుడూ, వైద్యుడూ, శక్తిసింహుడి కుమారులూ, ఎంత బ్రతిమాలినా దేవసింహుడు వినే ధోరణిలో లేడు. ఇదిచూచి వృద్ధురాలుకూడా "బలవంతాన రాజ్యభారం నెత్తినపెట్టి ప్రయోజనంలేదు. కనుక దేవసింహుడు చెప్పినట్టు ఈ కుర్రవాళ్ళకే పట్టాభిషేకం జరిపించండి, పోయిరండి" అని సలహాయిచ్చింది. కాని ఎవరూ అందుకు అంగీకరించలేదు.

అప్పుడు శక్తిసింహుడి కుమారులు, "మనవంశంలో మిగిలినవాళ్లం అంతా యిక్కడనే వున్నాము. రాజరికం వెలగబెట్టాలని మాకూ కాంక్షలేదు. నీతోపాటు మేమూ ఈ భవనంలోనే వుండేందుకు అనుమతించు. అదే పదివేలు" అన్నారు.

కొంచెంయోచించి, తరువాత వృద్ధురాలు సరేనన్నది. దేవసింహుడితోపాటు, శక్తిసింహుడూ, వైద్యుడూ, మంత్రీ, శక్తిసింహుడి కుమారులూ ఆ అపూర్వసౌధంలోనే వుండిపోయారు. అయితే ఇదివరకు ఒక్క దేవసింహుడికొరకే ఉద్దేశించబడిన ఆ భవనం యిప్పుడు తక్కిన అందరికీ ఉపయోగపడేటట్లు ఎన్నోసౌకర్యాలతో అమరిపోయింది. ఒకరికొకరు చేదోడువాదోడుగా అందరూ హాయిగా వుంటున్నారు.

ఈవిధంగా, నాథుడు లేని ఆ రాజ్యానికి 'అనాథరాజ్యం' పేరుమట్టుకు చిరస్థాయిగా నిలిచిపోయింది. —(కథ సమాప్తం)



# కవిపూజ



చాలాకాలంకిందట పర్షియాదేశంలో ఒకానొక మహాకవి ఉండేవాడు. ఆయన పేరు ఫిరదౌసి. ఫిరదౌసి మహాకవి 'షానామా' అనే గొప్ప గ్రంథాన్ని రచించాడు. దానిని, ఒకరోజు కాదు—ఒక వత్సరము కాదు- ముప్పయి సంవత్సరాలపాటు అష్టకష్టాలు పడి ఆయన వ్రాశాడు.

ఆ గ్రంథం, పారసీక చక్రవర్తుల చరిత్రను లోకచరిత్రతో కలిపివ్రాసిన అమర కావ్యం. అందులో ఫిరదౌసి తన కవితా ప్రతిభ నంతటినీ కనబరిచి రచనచేశాడు. 'షానామా'లో అరవైవేల పద్యాలువున్నాయి. ఆపద్యాలన్నీ జ్ఞానరత్నాలు, దివ్యమణులు, ఆణి ముత్యాలు! అవి ఒకదానిని మించినది మరిఒకటి.

జీవితంలో కృంగి కృశించిపోయే ప్రతి ప్రాణికీ 'షానామా' గ్రంథం ఒక చక్కటి సందేశాన్ని అందిస్తుంది. ప్రతివారి సందేహాలనూ తీర్చివేస్తుంది. అంతటి శక్తిగల మహత్తర గ్రంథం అది!

ఇటువంటి మహత్తర కావ్యాన్ని ఫిరదౌసి వ్రాదామని సంకల్పించినప్పుడు మొగల్ పాదుషా గజనీమహమ్మదు ఈ మహా గ్రంథం రచిస్తే ఒకొక్క పద్యానికి ఒకొక్క బంగారపు దీనారం బహుమతిగా ఇస్తానన్నాడు. ఖురాన్ సాక్షిగా ఫిరదౌసి మహాకవిని ఎంతగానో ప్రోత్సహించాడు.

పాదుషా మాటలను నమ్మాడు ఫిరదౌసి. రాత్రనక పగలనక నిద్రాహారాలు మానుకుని, ముప్పయి ఏళ్ళు శ్రమపడి 'షానామా' కావ్యాన్ని పూర్తిచేశాడు.

ఐతే, ఎందుకింతగా కవి శ్రమపడ్డాడు? అనేది ఒక సమస్యే. పెళ్ళియీడుకి వచ్చిన తన ముద్దులకూతురుకు దివ్యమైన పెద్ద సంబంధం తెచ్చి అతివైభవంగా పెళ్లిచేయాలనేది ఒక్కటే అతనికి పట్టుకున్న కాంక్ష.

పి. యోగానందం - కంభం




సుల్తాను తనకు గొప్ప బహుమతి ఇస్తాడు కదా, తన కోరిక నెరవేర్చుకోవచ్చుకదా అని ఆయన మనసులో పూర్తిగా ధైర్య పడ్డాడు. ఈ మనోధైర్యంతోనే దీక్షపట్టి ఫిరదౌసీ 'షానామా'వంటి అద్భుత కావ్యాన్ని అంత కొద్దిగడువులో సృష్టించగలిగాడు.

ఐతే—ఫిరదౌసి ప్రతిభ చూసి ఓర్వలేని మత్సరులు కొందరు సుల్తాను చెవిలో కిట్టని మాటలు నూరిపోశారు. చెప్పుడు మాటలు చెడ్డవికద! ఆ మాటలు చెవిని పడగానే పాదుషా మనసు విరిగిపోయింది. మొట్టమొదట కలిగిన మంచిసంకల్పం తిరిగిపోయింది. వెంటనే ఒంటెలను యేర్పాటుచేసి వాటిపైన బంగారునాణాలకు బదులుగా వెండినాణాలు వేయించి, ఫిరదౌసీకి కానుకగా పంపించాడు.

సుల్తాను అడినమాట తప్పటంతో కవి చేసిన కృషిఅంతా అడవికాచిన వెన్నెల అయింది! ఫిరదౌసి కుప్పగా కూలిపోయాడు. ఈ ముప్పయ్యేళ్లనుంచీ షానామాద్వారా తనుచేసిన జ్ఞానబోధలన్నీ ఆ క్షణమందు మరిచేపోయాడు. ఫిరదౌసి ఉద్రిక్తుడై, బాధ కొద్దీ పాదుషాను దుమ్మెత్తిపోశాడు!

అంతకీతోనైనా ఆవేశం ఆగలేదు ఫిరదౌసికి. తన పెరట్లో నిలబడివున్న ఒంటెలను పొలాలలోకి తరిమివేసి, వాటికి కట్టివున్న తాళ్లను పరపర కోసివేశాడు. అలా కోసివేయటంతోనే సంచీలలో వెండినాణాలన్నీ జలజలమని నేలని రాలిపోయినై.

ఒక్క లిప్తకూడా అక్కడ నిలవటానికి మనస్కరించలేదు. పిట్టకు తెలియకుండా ఫిరదౌసి మరొకదేశానికి పలాయనమై పోయాడు!! ఆ పరాయిదేశంలో ఉలక్క పలక్క, జీవచ్ఛవమై అజ్ఞాతంగా రోజులు నెట్టుతూవచ్చాడు.

ఇంతలో—సుల్తాను గజనీ మహమ్మదుకూ ఒక సామంతరాజుకూ మధ్యని

యుద్ధంవచ్చింది. యుద్ధంలో సుల్తానే ఓడి పోయే సూచనలు కనిపించినై. కేవలమూ ఏమీ చేయలేని స్థితి యేర్పడింది. అందు చేత, నిస్పృహతో నిరాశతో పాదుషా కృంగి పోయాడు. పైగా, ఈ స్థితిలో ఆయనకు ఏమీపాలుపోక,మంత్రిని పిలిచి సలహా అడి గాడు.అప్పుడు మంత్రి తనజేబులోనించి ఒక గ్రంథంతీసి, ఇలా చదివాడు : "రణరంగ మందు వెనుదిరుగబోకు. శత్రుదాడికి ఎదురుచూడకు. మొదట నీవే దెబ్బతియ్యి. విజయం నిన్నే వరిస్తుంది."




ఈ మాటలు చెవినిపడగానే సుల్తానులో కొత్తజవమూ జీవమూ ఉప్పొంగినై. నించు న్నపాటున సైన్యాలను సిద్ధంచేయించుమని అజ్ఞాపించాడు మంత్రికి.

"ప్రభూ!—ఇంత మండుటెండలో యుద్ధమా? శత్రు సైనికులుకూడా సేద తీర్చుకొంటున్నారే" అన్నాడు మంత్రి.

అందుకు పాదుషా "అవునయ్యా, అందు కోసమే మనమిప్పుడు దెబ్బతీయాలి. ఇదే మనకు విజయసూచన. చెయ్యి, సైన్యాలు సిద్ధంచెయ్యి" అని వేగిరపెట్టాడు.

మిట్టమధ్యాహ్నం. మిడసరి లగ్నం. సైనికులందరూ విశ్రాంతి తీసుకొంటూ, ఆద మరచి వున్నారు. ఆ అదునులో సుల్తాను సేనలు హఠాత్తుగా శత్రువును ఢీకొని, విజయం పొందినై.

సుల్తాను ఆనందభరితుడైనాడు. వెంటనే మంత్రిని పిలిపించి, "మంత్రీ!—నువు పుస్తకంతీసి నాకు చదివి వినిపించావే, ఆ వాక్యాలు ఏపుస్తకంలోవి?" అని ఆత్రం తోనూ ఆశ్చర్యంతోనూ అడిగాడు.

అందుకు మంత్రి "అవా? ఎవరినైతే దేవరవారు న్యూనతపరిచి, అతని పలా యనానికి కారణభూతులైనారో, ఆ కవిసార్వ భౌముడు ఫిరదౌసి వ్రాసిన వాక్యాలే!" అని నిర్భయంగా చెప్పాడు.



సుల్తాను నిస్తబ్ధుడయ్యాడు! కవికి తను చేసిన మహా ద్రోహానికి తనలో తను ఎంత గానో సిగ్గుపడాడు!! వాగ్దానంచేసిన అరవైవేల బంగారు దీనారాలూ పట్టించుకువెళ్ళి, కవి చంద్రుని వెతికిపట్టి, ఆ మహానుభావుడికి సమర్పించి రావలసిందని మంత్రికి ఆజ్ఞా పించాడు. ఆజ్ఞప్రకారం, మంత్రి యాభై లొట్టిపిట్టలమీద దీనారాలు సంచీలలో వేయించి, ఫిరదౌసీ ఉండే ఆ దూరదేశానికి పట్టించుకు వెళ్లాడు.

అప్పటికే ఒక యేడాదినుండి కుమిలి కృశిస్తూవున్న ఫిరదౌసి బంగారు దీనారాలు తెచ్చిన రాజభటులు తనవద్దకు వచ్చేసరికే అస్తమించాడు!

అక్కడ ఫిరదౌసి కూతురుమాత్రమే ఉన్నది. దీనారాలు తెచ్చిన భటులు ఆ నాణాలను ఫిరదౌసి కూతురుకు ఈయ బోయారు. అమె పుచ్చుకోలేదు. పట్టరాని దుఃఖంతో, ఆవేశంతో అమె వారిని ఉద్దే శించి : 'మీరు కాలయముబు. ఇది నా తండ్రి జీవితాన్ని అధఃపాతాళానికి అణగ ద్రొక్కిన నీచపుద్రవ్యం. దీన్ని నేను తాకిన ట్టయితే నాతండ్రి ఆత్మకు శాంతివుండదు. పొండి పొండి. తీసుకపొండి. ఈ ధనంతో ఇంకా మేడలూ మిద్దెలూ కట్టించుకుని మీ సుల్తానునే కులకమని చెప్పండి పోయి...!' అంటూ, వాళ్లను తిరగగొట్టి పంపివేసింది!

వజ్రఘాతంవంటి ఈవార్త వినగానే, సుల్తాను గజనీ బిరబిర కొలువులోనించి శయనమందిరానికి పోయి, తలుపులు వేసు కుని, కవీశ్వరుణ్ణి తలుచుకొంటూ కన్నీరు మున్నీరుగా వలవల యేడ్చాడు!!

తరువాత — 'దూసు' పట్టణమందు ఫిరదౌసి కవిపేర ఒక చక్కటి సత్రం నిర్మించి, ఋణంతీర్చుకున్నాడు. ఆ సత్రం శిథిలాలు ఈనాటికీ కనబడతాయి. పారశీ కులు వాటినిచూచి నేటికీ కన్నీరు విడుస్తారు.



# పోటీ వాళ్లతో సరిగంగస్నానం

చెన్నపట్టణం సేతుపేటలో వెంగన్నమొదలి వీధి వుంది. అందులో ఏడవనెంబరు ఇంట్లో కామేశ్వరమ్మగారూ, ఎనిమిదవ నెంబరు ఇంట్లో సోమేశ్వరమ్మగారూ కాపురాలున్నారు. ప్రతీవిషయంలోనూ ఆవిడకూ ఈవిడకూ పోటీగా ఉంటూవుండేది.

కూతురుపుట్టినరోజు వస్తే ఇద్దరూచేశారు. సోవమ్మ కాగితపుసంచీలలో తాంబూలం, అరటిపండూ, మిఠాయివుండాపెట్టి ముత్తైదువలకు పంచిపెడితే, కావమ్మ కాగితపు సంచీకి బదులు గుడ్డసంచీలు కుట్టించి, ప్రతీ సంచీలోనూ అదనంగా కొబ్బరికాయా, మైసూరుపాకూ, ఇంకా ఏవేవో గమ్మత్తులు పెట్టి మరింత దర్జాగా పంచిపెట్టింది.

ఆవిడ రెండంగుళాల జరీ అంచు చీర కొనుక్కుంటే ఈవిడ మూడంగుళాల జరీ అంచు చీరె కొని కట్టుకొని, పనివున్నట్లు వెళ్ళి ఆవిడకి ప్రదర్శించి వచ్చేది.

ఏడోనెంబరిల్లూ, ఎనిమిదోనెంబరిల్లూ కొత్తగా కట్టినవే. ఎనిమిదోనెంబరింటికి ఎలక్ట్రిక్ దీపాలున్నాయి. కావమ్మగారింటికి లేవు. కావమ్మగారి కిది కష్టంగానే కనిపించింది. సోవమ్మకూడా దీపాలు లేకపోతే ఈవిడకంత కష్టంగా ఉండకపోను.

కావమ్మకి మరొకబాధకూడా వచ్చింది. ఏమిటంటే సోవమ్మగారు రేడియో కొనుక్కున్నారు! అసూయతో కావమ్మ చిక్కిపోవటం మొదలుపెట్టేసరికి ఆవిడ భర్త విద్యుద్దీపాలకు బదులు ఒక పెట్రొమాక్సులైటూ, రేడియోకుబదులు ఒక గ్రామఫోనూ కొని తెచ్చాడు. కావమ్మగారు పెట్రొమేక్సు దీపాన్ని రోజూ సాయంత్రం నాలుగ్గంటలకే వెలిగించుకు కూర్చునేది గొప్పకోసం!

ఎనిమిదోనెంబరింట్లో రేడియో వినిపిస్తోందనేసరికి, ఇవతల అన్నం వార్పుకు వచ్చినా, వదిలేసిపోయి గ్రామఫోను వేసివచ్చేది!

పి. ఆర్. జానకి - ఖర్గపూర్



ఆ వీధిలో మహిళామణులంతా సోవమ్మ గారంటే మర్యాదగా చూసేవారు. ఇది కావమ్మకి అమర్యాదగా వుండేది.

ఇంతలో దసరాపండుగ లొచ్చాయి. వీధి ఆడవాళ్లంతా ఒక తీర్మానంచేశారు. 'ఎవళ్ళింట వాళ్లు బొమ్మలకొలువులు పెట్టుకోడంకన్న, అందరి బొమ్మలూ చేర్చి లలితమ్మగారింట పెద్ద కొలువుపెట్టి బ్రహ్మాండంగా చేద్దాం!' అని అనుకున్నారు.

అందుకు సోవమ్మ "బాగానేవుంది ఈ పద్ధతి"అంది. అప్పుడు కావమ్మ, 'ఈ మాట అసలు నాకే తోచింది. నేను చెబుదామనుకుంటూంటే వాళ్లు చెప్పేశారు!' అంది.

"ఎవరుచెబితేంలెండి గాని, సోవమ్మ గారూ, మన ఉత్సవాలు బాగా జరగాలీ అంటే మీరొక్క ఉపకారంచెయ్యాలండీ" అంది లలితమ్మ. ఆదుర్దాగా వింది కావమ్మ.

"ఏంలేదూ : ఆ తొమ్మిదిరోజులూ మీ రేడియో కొలువుకి ఎరువియ్యాలి" అంది లలితమ్మ.

రేడియో ఎరువిచ్చి సోవమ్మ గొప్పదైపోతోందనీ, తనకలాంటి మెహర్బానీ రావటానికి అవకాశం లేకుండాపోయిందనీ కావమ్మ లోలోపల విచారించటం మొదలెట్టింది. సోవమ్మగారు, "మా రేడియో పాడయిందమ్మా ఈమధ్య. మా వార్ని రిపేరు చేయించమంటే వారికి ఒక్కటే అశ్రద్ధ. పైగా, క్షణం తీరుబాటుండదు" అంది.

ఈమాట వినేసరికి కావమ్మకు కలిగిన ఆనందం అంతా ఇంతా కాదు. సోవమ్మ వెళ్లగా చూసి ఆమె లలితమ్మతో "చూశావా ఎంత అబద్ధమాడిందో! రేడియో పాడైందిట! ఇప్పుడేకదుటమ్మా పెట్టుకున్నారు వాళ్ళు! అని ఒక పచ్చిఅబద్ధం చెప్పి, "పోనీగాని మా గ్రామఫోను ఇస్తాను పట్టించుకెళ్లండి. చక్కా వీప్లేటు కావలిస్తే అది పెట్టుకోవచ్చు. ఎల్లుండి పాడ్యమినాడు పొద్దుటే రండి, పనిమనిషి నెత్తినపెట్టి

పంపుతాను" అంది. కృతజ్ఞత తెలిపి, లలితమ్మ వెళ్ళిపోయింది.

ఆరాత్రి కావమ్మగారి కొడుకు గ్రామఫోనుకి 'కీ' యిస్తోంటే స్ప్రింగు కాస్తా పుటుక్కుమని పూరుకుంది. "అయ్యో, కొంప ముంచావురా. ఎల్లుండి లలితమ్మ వస్తే ఏమని చెప్పేది!" అంటూ బాధపడింది, కావమ్మగారు. ఉన్నపాటున మరమ్మతు చేయించమని భర్తను తొందరపెట్టింది.

"చూద్దాంలే" అన్నాడాయన. "ఎలాగురా భగవంతుడా?" అని ఆమె రోజంతా ఎంతగానో మథనపడింది. రాత్రి సరిగా నిద్రపట్టనేలేదు ఆవిడకి.

మర్నాడు మొగవాళ్లు ఆఫీసులకి పోయాక సోవమ్మ భోజనంచేసుకొని తలుపు తాళంవేసి ఎక్కడికో బయల్దేరింది. కావమ్మ చూసి, "ఎక్కడికి చెప్మా?" అనుకుంది.

మరోగంటసేపటికి ఒక మోటారు లారీ వచ్చి సోవమ్మగారి యింటికి యెదురుగా ఆగింది. కావమ్మ బయటకువచ్చి చూసింది. మిట్టమధ్యాహ్నం. యెండవేళ. యెక్కడా జనసంచారం లేదు. లారీలో వచ్చినవాళ్ళు ఇద్దరూ సోవమ్మగారి ఇంట్లోంచి రేడియో మోసుకొస్తో కావమ్మ కంటపడ్డారు.



అప్పుడావిడ, "ఇందుకా వెళ్లింది సోవమ్మ? రహస్యంగా వీళ్లని పంపి తన రేడియో మరమ్మతు చేయించేస్తోందన్న మాట! నేను గ్రామఫోను యిస్తానని తెలిసి ఆ మర్యాద నాకు దక్కకుండా వుండాలని చెప్పి తన రేడియో చప్పుచప్పున మరమ్మతు చేయించి యిచ్చేస్తోందా!" అని తనలో అనుకుంది.

వాళ్ళు ఆవిణ్ణి చూసి తెల్లబోయారు. ఆవిడ "మీగుట్టు నాకు తెలిసిందిలెండి! రేడియో మరమ్మతుకని పట్టుకుపోతున్నారా త్వరగా పూర్తిచేసి పట్టుకురమ్మందికాదూ సోవమ్మ? యెంతగుట్టు!" అన్నది.



వాళ్ళలో ఒకడు చటుక్కుని 'ఔనండి, యెవరికీ తెలవనివ్వద్దన్నారావిడ? సాయంత్రంలోగా తెచ్చేసి హాల్లోపెట్టెయ్యమన్నారు' అన్నాడు.

అప్పుడు కావమ్మకు ఒక ఆలోచన తట్టింది. "ఐతే, ఒక్క రేడియోలుమాత్రమేనా, మీరు గ్రామఫోన్లుకూడా మరమ్మతు చేయగలరా?" అని అడిగింది వాళ్లను ఆత్రంతో.

'చెయ్యకేం?' అన్నాడు అతడు.

"మాయింట గ్రామఫోను పాడైంది. దాన్నికూడా బాగుచెయ్యండి ... మరొక సంగతి: రేడియో మరమ్మతు చాలా కాలం అవుతుంది గనక మెల్లిగా చెయ్యొచ్చు. నా గ్రామఫోనుమాత్రం సాయంత్రంలోగా ఇచ్చెయ్యాలి. మీరు కోరుకున్న బహుమతీ ఇస్తాను!" అన్నది.

వాళ్ళు సోవమ్మగారి రేడియోతోబాటు కావమ్మగారి గ్రామఫోనుకూడా లారీలో పెట్టుకుని తొందరగా వెళ్ళిపోయారు. నాలుగ్గంటలకి సోవమ్మగారు ఇంటికొచ్చి తలుపు తీసుకొనేసరికి హాల్లో రేడియో కనపడలేదు!

ఆదుర్దాగా వచ్చి కావమ్మగారితో, "ఏమండోయ్, ఎవళ్ళో మా రేడియో ఎత్తుకపోయారు! వీధితాళం మారుచెవులతో తీసినట్లుగా వుంది. తక్కిన గదుల తాళాలు ఏమీ తాకనేలేదు. ఇంకా నయం, హాల్లో వున్న రేడియోతో సరిపెట్టరు" అనిచెప్పి అనేకవిధాల వాపోయింది.

కావమ్మ నిర్ఘాంతపోయింది. "దొంగలా వాళ్లు? అందుకేగామోసు నన్నుచూసి తెల్లబోయారు! నేను వేరేధోరణిలో వుండి వాళ్లకి గ్రామఫోను చేతులారా అర్పించుకున్నానన్నమాట! పోటీకి పోతే ఇంతే గతి. 'సాటివాళ్లతో సరిగంగస్నానని కెడితే, ముసలిమొగుణ్ణి కాస్తా మొసలి ఎత్తుకుపోయిం'దని శాస్త్రం. సరిగ్గా అలాగేఐంది యిప్పుడు నాపని!" అనుకొంటూ, ఆమె లోలోపలే ఏడ్చుకు పూరుకుంది.





# దేవరహస్యం

పుళిందదేశాన్ని పూర్వం ఒకప్పుడు మాణిక్యప్రభు అనే రాజు ఏలుతూ వుండేవాడు. ఆయనకు పరమదుర్మార్గుడని పేరువచ్చింది. ఐతే, ఇటువంటి చెడ్డపేరు రావటానికి ఒక ప్రబలమైనకారణమున్నది. అది యేమిటీ అంటే: రాజ్యంలో ఎవరికైనా కవలలు పుట్టినట్టయితే రాజ్యానికే అరిష్టం కలుగుతుందని ప్రభువుకు గాఢమైన నమ్మిక. అందుచేత, రాజ్యంలో ఎక్కడగాని ఎవరికిగాని కవబిడ్డలు పుట్టే లక్షణాలు తెలిస్తేచాలు, వెంటనే వచ్చి తనకు విన్నవించాలని శాసనంచేశాడు.

శాసనంప్రకారం, తనకు ఏదైనా వర్తమానం తెలిసిందనేసరికల్లా ఆ పుట్టిన కవలను రప్పించి, వాళ్లను చంపించివేయటం మామూలైపోయింది. ఈ కారణంవల్ల కవలలు పుట్టడమంటే రాజ్యంలో దంపతులందరకూ హడలుగా వుండేది.

ఇటువంటి పుళిందదేశంలో ఒక కుగ్రామమందు దేవయ్య, చంద అని పేదదంపతులుండేవాళ్ళు. వాళ్లకు లేకలేక సంతాన భాగ్యం కలుగుతుందనేటప్పటికి, తీరా కవలలుపుట్టే చిన్నెలు కనిపించినై. దాంతో పాపం, వాళ్లకు దిగులుపట్టుకున్నది. 'పుట్టితేమట్టుకు బిడ్డలు బతికేయెత్తు లేదు కదా' అని చంద్ర దుఃఖింపసాగింది.

ఐతే - దేవయ్య గుండెనిబ్బరంకలవాడు. భార్యకు అనేకవిధాల ధైర్యంచెప్పి, ఓదార్చాడు. తనయింటి పరిస్థితి పిట్టకైనా తెలియనీయక గుట్టుగా వుంచాడు. పురిటి సమయానికి అత్తగారైన అవ్వను రప్పించుకున్నాడు.

ఆ అవ్వ మాణిక్యప్రభువువారి దాసీలలో ఒక దాసీ. దాసీలందరూ సామాన్యంగా కోటలోనే కాపరం ఉండిపోయి, ఎప్పుడు పిలుపువచ్చినా పలక

కె. బాలసుబ్రహ్మణ్యం - తంజావూరు




టానికి సిద్ధంగా వుండాలి. కనుక, అవ్వ కూడా కోటలోనే ఉంటూవుంటుందని వేరే చెప్పేదేమిటి ?

అనుకున్నట్టుగానే చంద్రకు కవలలు పుట్టారు. ఒకబిడ్డ ఆడది, రెండవబిడ్డ మగవాడు. వాళ్లకు విజయ, విక్రమ అని పేర్లుపెట్టి, వాళ్ళను దంపతులు ఎంతో అల్లారు ముద్దుగా అపురూపంగా పెంచుకొంటూ వున్నారు.

ఇక్కడ పల్లెటూర పేదదంపతులకు కవలలు కలిగిన క్షణంనుంచీ అక్కడ రాజుకు చెప్పలేని బాధ యేదో మనసులో ప్రారంభమైంది. పిల్లలు పెరిగి పెద్దవాళ్లవుతున్నకొద్దీ రాజుకు ఆవేదన ఎక్కువగుతూవచ్చింది. రోజురోజూ పీడకలలు కూడా రాసాగినై.

జ్యోతిష్కులను పిలిపించి, రాజు తన బాధకు కారణం ఏమైవుంటుందా అని ప్రశ్నించాడు. వారు శాస్త్రాలన్నీ తిరగవేసి, 'ఇది రాజ్యంలో కవబిడ్డలు పుట్టిన ఫలితం. మరేమీకాదు' అని కచ్చితంగా చెప్పారు.

తక్షణమే మాణిక్యప్రభు వాడవాడలా దండోరా కొట్టించాడు—రాజ్యంలో కవబిడ్డలను పట్టితెచ్చినవాళ్లకు గొప్పబహుమతి ఇస్తామని. దేవయ్యా నివసించే గ్రామంలో కూడా దండోరా కొట్టారు.

చిత్రమైన ఈ చాటింపు చెవిని పడటంతోనే, ఎంత నిబ్బరం కలవాడైనప్పటికీ దేవయ్యా గుండెలు పీచుపీచుమన్నాయి. అయితే, అతడు బుద్ధిశాలి. బెదిరిపోలేదు. నిదానంగా భార్యకు మంచిచెడ్డలన్నీ నచ్చజెప్పి, కుమారుడైన విక్రముణ్ణి వెంటబెట్టుకుని పారిపోయాడు.

పోయిపోయి, దేవయ్యా కొన్నాళ్ళకల్లా మక్కళరాజ్యం చేరుకొన్నాడు. మక్కళదేశపు రాజు మాణిక్యప్రభువుకు కప్పము కట్టే చిన్నపాలకుడు. అతనికి ఒక పన్నెం

డేళ్ల కుమారుడు ఉన్నాడు. అనగా దేవయ్యా కొడుకు విక్రముడూ, మక్కళ రాజ పుత్రుడూ ఒక్కయీడు వాళ్లన్న మాట. వాళ్ళిద్దరికీ నేస్తంకలిసింది. ఆ వేళావిశేషం ఎటువంటిదో కాని, ఇద్దరూ ప్రాణస్నేహితు లైనారు. ఈ కారణంవల్ల దేవయ్యాకు మక్కళరాజుకోటలో కొలువు కుదిరింది. విక్రముడు తన ప్రతిభవల్ల, అంచీలమీద అనేక పదవులు సంపాదించి, చివరకు సేనాధిపతి అయి రాణించాడు.

ఇది ఇలావుండగా, అక్కడ పుళింద దేశంలో ఏమి జరిగిందంటే—

భర్త పలాయనమైనప్పటినుంచీ ఒంటి పాటుగా ఉండలేక, చంద్ర తన కూతురు విజయను వెంటబెట్టుకుని మెల్లగా తల్లి వద్దకు చేరుకుంది.

అయితే—అవ్వకు గట్టిచిక్కు పట్టు కున్నది. ఇప్పుడు కోటలో ఉండటమంటే కేవలమూ పులినోట్లో ఉన్నట్టేకద! ముద్దుల మనమరాలు విజయను, గుట్టు బయట పడకుండా ఎలా కాపాడుకురావటం?— ఇదే పెద్ద సమస్యఐకూర్చుంది.

ఐతే, అవ్వ అనుభవశాలి. అచ్చ మగపిల్ల వానికి మోస్తరుగానే ముస్తాబుచేసి తయారు



చేసింది విజయను. ఆ పిల్లనుచూచి అందరూ మగవాడే అనుకొంటున్నారుకాని, ఏవిధంగానూ అనుమానించలేదు.

ఒకరోజున విజయ, అవ్వతోకూడా అంతఃపురంలోకి వెళ్ళింది. ఆమె ఇంతకు ముందెన్నడూ అద్దం చూచివుండలేదు. కనుక అద్దమంటే యేమిటో, ప్రతిబింబ మంటే యేమిటో తెలియనె తెలియదు.

అంతఃపురంలో నిలువుటద్దంలో చూచే సరికల్లా తన పురుషవేషం కనపడి, అప్ర యత్నంగా ఆమె ఆత్రంతో "అన్నా! అన్నా!!" అని పిలిచింది. ఈ పిలుపు అక్కడవున్న ఒకదాసికి వినిపించి, ఆమె



ఈ విడ్డూరమేమిటో చూదామని చెప్పి గుమ్మంవద్దనే పొంచివున్నది.

అంతలో అవ్వవచ్చి సంగతి తెలుసుకున్నది. అమాయకతవల్లనే తన మనుమరాలు ఇలా కేకవేసినట్టు గ్రహించింది. విజయ కవబిడ్డఅనీ, కవబిడ్డలకు రాజువల్ల గండం ఉన్నదనీ, అందుకే మారువేషంలో ఉండవలసివచ్చిందనీ, గుట్టుగా కాలక్షేపం చెయ్యకపోతే ప్రాణానికే మోసమనీచెప్పి ఆమె మనుమరాలిని హెచ్చరించింది.

పొంచివున్న దాసీది ఈ మాటలన్నీ చెవులారా వినిపోయి, రాజుగారి చెవిని వేసింది. వెంటనే రాజు అవ్వనూ మనుమరాలినీ ఖైదులో పెట్టించి, రెండవబిడ్డ గుట్టు చెప్పమని బలవంతపెట్టాడు. ఎన్ని యాతనలుపెట్టినా అవ్వ ససేమిరా చెప్పింది కాదు. దేవరహస్యంగానే వుంచింది. అందుచేత, నిర్దాక్షిణ్యంగా రాజు అవ్వను హతమార్చివేశాడు. తెలివిగల అవ్వ ఈ సందడికి ముందు చంద్రను పారిపొమ్మని ఉపాయం చెప్పి మరీ పోయింది. చంద్ర తంటాలుపడి మక్కళరాజ్యం చేరుకుంది.

ఎంత నిర్బంధించినా అన్నను గురించి విజయ చెప్పలేకపోయింది. నిజానికి పాపం, ఆమెకు ఏమీ తెలియనే తెలియదుకద! రాజుకి ఏదో ఆలోచన తట్టి, ఆమెచేత వ్రాత వ్రాయించి పుచ్చుకున్నాడు. ఈమో స్తరు దస్తూరీతో పోలికగల దస్తూరి ఎక్కడైనా దొరుకుతుందేమో కనిపెట్టమని నిపుణులను నియమించాడు.

ఆ సమయంలో ఎవరో రాయబారి ఒక జాబు తెచ్చి రాజుకు సమర్పించుకొన్నాడు. అది మక్కళదేశపు రాజువద్ద నుండివచ్చిన జాబే! విప్పి చూడటంతోనే రాజు అమితాశ్చర్యపోయాడు! ఏమీ? ఆ లేఖలోని దస్తూరీ సరిగ్గా విజయ చేతి వ్రాతమోస్తరుగానే వున్నది.

తరువాత చదివేసరికి, ఉత్తరంలో ఇలా వున్నది :—"ప్రభూ!—దేవరకు ఒకేసారి ఎనభై బళ్లమీద వేయించి బంగారు మొహిరీలు సమర్పించుకుంటాను. ఇవి స్వీకరించి, మా రాజ్యాన్ని స్వతంత్ర రాజ్యంగా ప్రకటించ కోర్తాను."

ఇది చదివి రాజు చాలా సంతోషించాడు. "ఇప్పుడు పంపినజాబు వ్రాసిందెవరో వారి పరంగా ద్రవ్యం పంపినట్టయితే కోరిక నెరవేరుస్తా'మని వ్రాసి, ఆ రాయబారిచేతనే జవాబుపంపించాడు మాణిక్యప్రభు.

ఈజాబు చేరిన కొద్దిరోజులకే అనుకున్న ప్రకారం, మక్కళరాజ్యంనుండి ఎనభై బళ్లువచ్చేసి, నగరపొలిమేరలో విడిసినై. మాణిక్యప్రభుకు కబురు తెలియగానే ఆ కపబిడ్డ ఎలా వుంటాడో చూడాలనే ఆత్రంతో స్వయంగానే బయల్దేరి పొలిమేర వరకు తరలివెళ్లాడు.

మొట్టమొదటి బండిలోనుండి దిగివచ్చిన విక్రముడు రాజుకు వినయపూర్వకంగా నమస్కరించాడు. రాజు ఆశ్చర్యానికి మేరలేకపోయింది! విజయా, విక్రముడూ ఒక్క అచ్చున పోతపోసిన బొమ్మలు!! ఏమీ తేడాలేదు.



రాజు పిల్లవానిని ఎంతో అప్యాయంతో ఆదరించాడు. కుశలప్రశ్నలు వేశాడు. మాటవల్లా, రూపువల్లకూడా ఈ పసివాడు విక్రముడు, విజయతోడి కపబిడ్డేనని నిశ్చయమై పోయింది. 'ద్రవ్యపు సంచీలు దింపించమని సెలవా!' అని అనుజ్ఞకోరాడు విక్రముడు. అటు అనుజ్ఞనిస్తూ, దుష్టుడైన మాణిక్యప్రభు ఇటు భటులకు సంజ్ఞ చేశాడు.

రాజు సంజ్ఞచేసేలోపలనే విక్రముని సంజ్ఞ అందుకుని ఎనభై బళ్ళపైనున్న ద్రవ్యపు సంచీలలో ఒక్కొక్కదానినుండి ఒకొక్క యోధుడు బిలబిలమంటూ

బయటికి వచ్చేశాడు. వాళ్లందరూ అయు ధాలతో తయారుగావున్న వీరులు! అద మరవున వున్న రాజుపరివారంమీద పడి, వాళ్లను నుగ్గునుగ్గు చేసివేశారు. ఆ సంద డిలో ఎవరు చంపివేశారో గాని, పాపం! మాణిక్యప్రభుకూడా నేలని కూలాడు.

మాణిక్యప్రభు చచ్చినందుకు నగరంలో ఎవ్వరూ విచారం కనబరచలేదు. సేనాధి పతి ఐన విక్రమునిచూచి అందరూ జోహారు చేశారు. అతడు విజయకు అన్నగారేనని తెలిసి ముచ్చటపడ్డారు. అతని యుక్తికీ, ప్రభుభక్తికీ, శౌర్యానికీ, ప్రతాపానికీ లోకులు జేజేలుకొట్టారు. విక్రముడే పుళిందదేశ రాజుగా ఉండాలని ప్రజలుకోరినారు. కాని, విక్రముడుమాత్రం అందుకు అంగీకరించ లేదు. తనను పోషించి రక్షిస్తూవచ్చిన మక్కళరాజ్యంతో ఈ రాజ్యం ఐక్యంకావ టమే తన అభీష్టమని సూచించాడు. ప్రజలు శిరసావహించారు. ఈవిధంగా మక్కళరాజుకు స్వాతంత్ర్యం సిద్ధించటమే గాక, విక్రముని శక్తివల్ల మహాసామ్రాజ్య మైన పుళిందరాజ్యంకూడా దఖలుపడింది.

విక్రముని ఔదార్యానికిమెచ్చి, మక్కళ రాజు కుమారునికి అవెంటనే పట్టంకడుతూ విక్రమున్ని మంత్రిగా చేసుకున్నాడు.

పైగా, విజయకూ మక్కళరాజపుత్రు నికీ అతివైభవంగా వివాహమైంది. ఈ విధంగా, రెండు రాజ్యాలకూ తలవని తలంపుగా మైత్రిఏర్పడి, అందరూ సుఖంగా ఉంటున్నారు. నాటినుంచీ కవలనుగురిం చిన దుష్టశాసనానికి స్వస్తిచెప్పివేశారు.

కృతజ్ఞుడైన విక్రముడు, తమ కుటుం బాన్ని రక్షించటానికని బలిఅయిపోయిన అవ్వజ్ఞాపకార్థం, ఆమె చనిపోయిన ఆ మైదానంలో ఒక అద్భుతమైన దివ్యభవనం కట్టించాడు. అది ఒక ఆలయంలాగా వుండేది. దానిని పవిత్రస్థలంగా ఎంచి, జనమంతా చూడవచ్చేవాళ్ళు.






అనగనగనగా ఒక అడవి. ఆ అడవిలో సమస్తమైన జంతువులూ సంచరిస్తూ ఉండేవి. అవి ఎటువంటి వైరమూ లేకుండా, సఖ్యంగా మసులుతూవుండేవి.

ఒకప్పుడు రోహిణికార్తెలో, ఎండలు మండిపోతూవుండగా, ఒక కుందేలు తన బొరియనుండి బయటికి వచ్చింది. ముందు కాళ్లతో ఒక్కమారు ముఖం తుడుచుకొని, పెదవులమీద నాలుక అటుయిటు తిప్పి, చుట్టూ కలయజూచేసరికి, వేడిగాలి భరించలేక ఆపసోపాలుపడుతూ వస్తున్న నాలుగు కోతులు దానికి ఎదురుపడినై.

కోతులూ, కుందేలూ ఒకళ్లనొకళ్ళు పలకరించుకొన్నాయి. కుశలప్రశ్నలు వేసుకున్నాయి. ఒక చెట్టునీడని నించుని చాలాసేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్నాయి. అన్నీ అయినతరవాత కోతులు ఊరికేవుండక తమాషాకి కుందేలుతో "నేస్తం! నేస్తం!! మాయింటిదగ్గర కడవనిండా ప్రశస్తమైన పుట్టతేనె పట్టివుంచాము. ఆ మకరందం ఆరగించామంటే ఈ వడదెబ్బ కాస్తంత తగ్గుతుంది. రా, మాతో రా!" అని చెప్పి, దానిని ఆహ్వానించినై.

తెల్లటివన్నీ పాలే అనుకునే అమాయకురాలు కుందేలు. వాళ్ల పిలుపు నిజమే ననుకొని, అది కోతులవెంట వెళ్ళింది. వెళ్లగా వెళ్ళగా ఒక బ్రహ్మాండమైన జువ్వి చెట్టు కనిపించింది. ఆ చెట్టుపైన నివాసానికి తగిన చక్కటియేర్పాట్లు ఎన్నో వున్నయి. ఇదే కోతులబస. కోతులు నాలుగూ ఛెంగున ఎగిరి, కొమ్మలు దాటుకొని బస చేరుకున్నాయి. అక్కడ ఒక పెద్ద కుండనిండుగా తియ్యటి పుట్టతేనె వున్నది. కోతులు నాలుగూ చక్కాకూర్చుని, వంతుల ప్రకారం ఆ కుండలో తేనె చప్పరించటం ప్రారంభించినై.

జె. ముఖ్యప్రాణరావు - తాడేపల్లిగూడెం



నేస్తులైన ఆ కోతులు ఇంకా ఎంతట తేనె తెచ్చియిస్తాయో అని చెప్పి ఆశతో కని పెట్టుకున్నది కుండేలు. అలాంటిపని యేమీ అవి చేయలేదు సరికదా, అందులో ఒక కోతి 'ఓయి కుందేలుభయ్యా! ఏమిటీ సందేహిస్తున్నావు? రా, చెట్టుమీదికి రావయ్యా! ఆహహా, ఈ మధువు చూడు, అమృతం! దేవతలు తాగే అమృతం!!' అని లొట్టలువేస్తూ, ఊరించింది.

కోతులుచేసిన కుచేష్టను గ్రహించింది బుద్ధిసూక్ష్మత గల కుందేలు. 'ఓసి తిమ్మన్నల్లారా! మీపని ఇలావున్నదా? కానీ, మీగడ్డి మీకు తినిపించకపోతానా' అని మనసులో అనుకొని, తల పంకించి తన బొరియలోకి మరలిపోయింది.

కొంతకాలమైనతరవాత ఆ అరణ్యంలోకి కోతులనుపట్టే వేటగాళ్ళు వచ్చారు. వాళ్ళు తరుముకువస్తున్నకొద్దీ కోతులు ప్రాణాలు రక్షించుకోటానికని అడవిలోపలికంటా పోజొచ్చినై. అలా పారిపోతున్న కోతులకు మన కుందేలు నివసించే బొరియ పక్కనించే దారి యేర్పడివుంది.

ఈ సమాచారం తెలిసిన కుందేలు ఒక తమాషాచేసింది. దానిలో బాగా ఒక పాతిక గజాలమేర ఆకూ అలమూ పరిచి, ఒక రాత్రివేళ నిప్పుపెట్టింది. ఆ చెత్త అంతా కాలిపోయి మసిఐ వూరుకుంది. ఏమీ ఆనవాలు తెలియకుండా దానిపైన ఎండుటాకులు మామూలుగా పరిచేసింది.

కుందేలు మనసులో అనుకొన్నట్టుగానే, ఒకరోజున దాని నేస్తాలయిన కోతులు నాలుగూ చెప్పిపోదామని అక్కడికి వచ్చినై. వాటి అవస్థకు కుందేలు విచారం నటించి, 'అయ్యోపాపం! దారీతెన్నూ తెలియని విదేశానికి పోవాలోకద మీరు? కష్టకాలం వచ్చిపడిందే! మళ్ళీ మనం కలుసుకునే దెప్పుడో!' అని సానుభూతి కనబర్చింది.



కోతుల గౌరవార్థం కుందేలు వాటిని విందుకు పిలిచింది. తన బొరియదగ్గర ఎంతో చక్కటి ఏర్పాట్లు చేసింది. 'భాయిూలూ! ఆ నదిలో స్నానాలుచేసిరండి. మంచి ద్రాక్షరసం తెప్పించాను. ఆరగిద్దాం. పోయి రండి చప్పున!' అంటూ తను తయారుచేసి వుంచిన ప్రదేశంమీదుగా దారిచూపింది.

కుందేలు విందు నిజమేననుకున్నాయి కోతులు. నదికి స్నానానికిపోయి బొరియకు రాబోతూంటే ఆకులకింది నుసి ఒంటికి అంటుకొని, అవి నల్లగా తయారైనాయి!

'ఇదేమిట్రా గోల' అనుకొని మళ్ళీ నదికి పోయినై కోతులు, నుసి కడిగేసుకు వద్దామని. స్నానంచేసిన తడివంటికి ఈ నుసి మరింత ఎక్కువగా అంటుకుంటుంది కదా అనే బుద్ధే పోలేదు వాటికి.

ఈవిధంగా నుసి వదుల్చుకుందామనే ప్రయత్నంలో ఆ కోతులు నదికి పోతూ వస్తూ ఉన్నాయిగాని, వళ్ళు పరిశుభ్రం చేసుకొని బొరియ చేరుకునే వుపాయం మట్టుకు వాటికి తోచనేలేదు.

ఇలా ఆ నదికి వస్తూ పోతూవున్న ఆ కోతులను ఎంతో ఆప్యాయంతో పిలుస్తూ, 'రండయ్యా కోతిభాయిూలూ!— ఎంత మధురాతి మధురంగా వుందయ్యా ఈ ద్రాక్షారసం!!' అని ఊరిస్తూ, ఒకొక్క గుటకే వేయసాగింది కుందేలు.

అంతలో వేటగాళ్ళు తరుముకువస్తున్న సందడి అయేసరికి బుద్ధిమాంద్యం గల మర్కటాలు కుందేలువేపు తిరిగి చూడ నైనా చూడకుండానే ప్రాణరక్షణకోసం దారిపట్టాల్సి వచ్చింది!!!

పోతూ పోతూ కోతులు 'ఆనాడు మనం కుందేలును వేళాకోళం చేశాం. దానికే ఇప్పుడీవిధంగా దెబ్బతీసింది అది. విలాసం కోసమైనా ఒకళ్ల మనసు నొప్పించకూడదు. బుద్ధి వచ్చింది' అని అనుకున్నాయి.




అనగనగా ఒకఊరు. ఆ ఊళ్లో కాపు దంపతులకు లక్ష్మమ్మ అనే కూతురు.

ఆ కాపుదంపతులు భూమంత అరుగూ ఆకాశమంత పందిరీ వేసి అతివైభవంగా కుమార్తెకు పెళ్ళిచేశారు. ఆ అల్లుడు చాలా అందమైనవాడు. ఎంత అందముంటేనేం, ఉత్తి తిక్క శంకరయ్య.

అతడి పేరు ఏదైతే మనకేం?—కథ నడవటంకోసం 'శంకరయ్య' అనే పిలుద్దాం. పెళ్ళిఐన కొద్దిరోజులకే శంకరయ్య వచ్చి పెళ్లాన్ని తీసుకువెళ్లతానని పట్టుపట్టాడు. 'తొందరపడితే ఎలాగోయ్? కొన్నాళ్లు పోనియ్యి. అమ్మాయికి సారే చీరా పెట్టి పంపిస్తాం. ఈలోగా నువ్వు పండగకీ పబ్బానికీ వచ్చి పోతూనేవుంటావుకదా' అన్నారు అత్తమామలు. అందుకు అల్లుడు 'నసేమిరా, ఆరుమూడైనాసరే ఇవేళే తీసుకు పోవాలి. తప్పదు' అని భీష్మించాడు.

చేసేదిలేక అత్తమామలు వారి పురోహితుణ్ణి రప్పించి, ఆవేళ ప్రయాణానికి మంచిరోజుఅవునో కాదో చూడమన్నారు. అందుకు పురోహితుడు "అబ్బెబ్బే, ఇవాళ నవమి. నవమినాడు ప్రయాణం ఎంత మాత్రం తగదు. దశమి మంచిది. రేపటి రోజున పంపండి" అన్నాడు.

"అలాచెయ్యి నాయనా" అన్నారు అత్తమామలు. అందుకు శంకరయ్య కోపగించి "ఎవడి పెళ్లాన్నివాడు తీసుకు పోవటానికి నవమేమిటి? దశమేమిటి? ఏమైనాసరే నేను ఇవాళే తీసుకువెడతాను! ఒక్క క్షణంకూడా ఆలస్యం కావటానికి వీల్లేదు" అన్నాడు.

ఇంక ఆలస్యం చేసినట్టయితే అతగాడికి కోపం రెచ్చిపోతుందేమో అన్న భయంకొద్దీ వాళ్లు గబగబా పాకపుచలిమిడీ అవ్వీ సిద్ధం చేసి, కొత్తచీరా రవికా పెట్టి, లక్ష్మమ్మని

పాలంకి వెంకటరామచంద్రమూర్తి - మదరాసు

భర్తవెంట అయితేఅయిందని నవమినాడే పంపేశారు.

* * *

వారంలో ఒక్కొక్క రోజుకి ఒక్కొక్క దేవత చొప్పునఅధిపతిగా ఉంటారు. ఆదివారానికి సూర్యుడూ, సోమవారానికి చంద్రుడూ, ఈవిధంగా ఏడురోజులకీ ఏడుగురు దేవత లున్నారు. ఇలాగనే పాడ్యమి మొదలైన పదహారు తిథులకూకూడా అధిపతులైన దేవతలున్నారు. ఈ తిథిదేవతల్ని 'పురుషులు' అంటారు.

నవమితిథికి అధికారిఐన దేవతపేరు 'నవమిపురుషుడు'. 'నవమినాడు ఎక్కడి వాళ్లక్కడ ఉండిపోయి విశ్రాంతి తీసుకోవాలి గాని ప్రయాణాలు చెయ్యకూడదు' అని నవమిపురుషుడు శాసించాడు. అందుకనే మనవాళ్లెవరూ సామాన్యంగా నవమినాడు ప్రయాణం చెయ్యరు. చేస్తేనవమిపురుషుడి ఆగ్రహానికి గురి అవుతామని భయమే ఇందుకు కారణం అని మనంఅనుకోవాలి.

* * *

ఎంతచెప్పినా వినక లక్ష్మమ్మని వెంట పెట్టుకుని నవమినాడు ప్రయాణంసాగించిన శంకరయ్యపైన నవమిపురుషుడికి కోపం




వచ్చింది. అతడికి బుద్ధిచెప్పాలని నవమి పురుషుడు నిశ్చయించాడు.

శంకరయ్యా భార్యా ఒక పట్టణ సమీపంగా పోతూవుంటే మధ్యదారిలో వాళ్లకి ఆకలివేసింది. లక్ష్మమ్మ తెచ్చిన పాకపు చలిమిడిలో కొంచెం మొగుడికిచ్చి, తను కొంచెం తింది. ఆమెకుదాహంవేసింది. మర చెంబు మగడికిచ్చి దానినిండా మంచినీళ్లు పట్టుకరమ్మని ఊళ్ళోకి పంపింది. చెంబు తీసుకువెళ్లేడు శంకరయ్య.

తలవని తలంపుగా దొరికిన ఈ అదును చూసి నవమిపురుషుడు సరిగా శంకరయ్య రూపంతో అలాంటి మరచెంబే నీళ్ళతో




నింపిపట్టుకువచ్చి, లక్ష్మమ్మ ముందట పెట్టేడు. సరిగా శంకరయ్య కంఠస్వరంతో, 'దాహంతీర్చుకు బయల్దేరు మరి. చీకటి పడకుండా మనం ఊరు చేరుకోవాలిగా' అన్నాడు. ఆ వచ్చినవాడు నిజంగా తనభర్తే అనుకొని ఆమె గ్లాసుడునీళ్ళు గబగబ తాగి, వెంటనే అతని వెంట ప్రయాణమైంది.

మరి కాస్సేపటికి అసలు శంకరయ్య మంచినీళ్లతో ఊళ్లోనుంచి తిరిగివచ్చి, అక్కడ లక్ష్మమ్మ కనపడక గాభరాపడాడు. తిన్నగా రోడ్డువైపు దృష్టిపెట్టి చూసేసరికి దూరాన మలుపు తిరుగుతోన్న లక్ష్మమ్మ తాలూకు పచ్చటి చీరకొంగు కనపడింది. ఆమె ప్రక్కనే మరొక పురుషుడు కనపడటంతోనే శంకరయ్యకి గుండె గుభేలు మంది. శరవేగాన పరుగెత్తి, రొజుకుంటూ పోయి ఆ యిద్దరిముందూ నిలబడ్డాడు. ఆయాసం తీర్చుకోకుండానే 'ఎవడవురా నువ్వు? నా పెళ్ళాన్ని తీసుకుపోతున్నావు? క్షమాపణ కోరుకుని నీదారిని నువు తొలగి పోతావా? లేక, డొక్కచీరి డోలుకట్ట మంటావా!' అని బెదిరించాడు.

మారురూపంలో ఉన్న నవమిపురుషుడు నిర్ఘాంతపోయినట్లు నటిస్తో, "ఏమిటయ్యా నీపెళ్ళాం అంటావేమిటి? నీకేమైనా మతి గాని పోయిందా? ఈమె నాభార్య. పుట్టింటి నుంచి ఇప్పుడే తీసుకువెడుతున్నాను. మా అత్తా, మామా 'ఇవాళ వద్దు. రేపు తీసుకు వెళుదుగాని'అని పట్టుబట్టినా వినక, అవతల తొందరపనివుంది. ఇవాళే తీసుకుపోతున్నాను" అని అంటూ, లక్ష్మమ్మ కేసి చూసి, "నడవ్వేం. ఈ పిచ్చివాడితో మనకేం పని పదపద?' అని ముందుకు సాగాడు.

శంకరయ్యకి కోపం, దుఃఖం ముంచెత్తుకొచ్చినై. భార్యకి అడ్డువచ్చి, "లక్ష్మీ నువ్వు మోసపోకు. వీడెవడో దొంగ. దుర్మార్గుడు!

నేనే నీ భర్తని ఇలాగ చూడు. నన్ను అన మాలు కట్టలేవూ? నా చీలమండమీద కంది బద్దంత పుట్టుమచ్చ వుందని నువ్వెరుగుదువా? అదే అనమాలు. నువ్వే చూడు!" అన్నాడు. లక్ష్మమ్మ నవమిపురుషుడి చీల మండమీదకూడా అలాంటి పుట్టుమచ్చే ఉండటంచూచి, ఆ ఇద్దరిలో ఎవడు తన భర్తో నిర్ధారణ చేసుకోలేకపోయింది.

ఇంతలో ఆ పట్నంఏలే రాజుగారు మంత్రితోసహా ఆటు షికారుకొచ్చి, 'ఏమిటీ గలభా?' అని అడిగారు. లక్ష్మమ్మే చెప్పింది: 'ప్రభూ! అనాడు దమయంతికి వచ్చిన చిక్కే ఇప్పుడు నాకూ వచ్చింది. ఆమె స్వయంవర మండపంలోకి వెళ్ళేసరికి ఒకరికి బదులు ఐదుగురు నలమహారాజులు ఒకరిపక్క వొకరు కూర్చునివున్నారు. ఆ ఐదుగురిలోనూ అసలునలుడు ఎవరో ఆమె తెలుసుకోలేకపోయింది. అలానే, ఒకే రూపంలోవున్న ఈ ఇద్దరిలోనూ నాభర్త ఎవరో తెలుసుకోలేకపోతున్నాను. ఈ చిక్కు నించి ప్రభువులు నన్ను రక్షించాలి' అని ప్రాథేయపడింది.



రాజు మంత్రికేసి చూశాడు. మంత్రి ఆలోచించాడు. 'దమయంతీ స్వయంవరానికి నలరూపంలో వచ్చిన తక్కిన నలుగురూ ఏరూపం పడితే ఆ రూపం తాల్చగలిగిన దిక్పాలకులు. ఈ ఇద్దరిలోకూడా ఒకడు అలాంటి దేవతే అయివుండాలి. ఈ ఇద్దరిలోనూ ఎవడు దేవతో, ఎవడుమానవుడో కనిపెట్టాలంటే, మనిషికి సాధ్యంగాని పని ఒకటి వీళ్ళిద్దరికీ నియమించాలి' అనుకున్నాడు. ఇద్దరినీ దగ్గరకు పిలిచాడు.

ఇద్దరిచేతులలోనూ కనపడుతోన్న మర చెంబులలో ఒకదాన్ని ఆయన అడిగి పుచ్చుకుని నీళ్ళు వంచేసి, నేలమీద పెట్టేడు. 'అబ్బాయిలూ, మీయిద్దర్లో ఎవడైతే ఈ సన్నమూతిగల చెంబులో ప్రవే

సించి, పైకిరాగలరో, వాడే ఈపిల్లకి భర్త' అన్నాడు మంత్రి.

అప్పుడు నవమిపురుషుడు, 'విడిసినట్టే వుందిపరీక్ష! నేనిట్టే చెంబులోకి దూరి ఇట్టే పైకిరాగలను! దాన్నిబట్టి ఈ పిల్ల నాభార్య అనిచెప్పి తీర్పుయిస్తావన్నమాట! కానియ్యి. శంకరయ్యను విడిపించటానికి ఇదీ బాగానే వుంది!' అని మనస్సులో అనుకుంటూ, తనలో పొంగే దురహంకారంకొద్దీ, శంకరయ్యను పీడించాలనే కసికొద్దీ, క్షణంలో తనదేహాన్ని కుదించి, దభుక్కుమని చెంబులోకి దుమికి గభుక్కుమని పైకి చక్కావచ్చేశాడు. వచ్చి, 'రా లక్ష్మీ. నేను నీభర్తనని నిరూపణ ఐపోయింది. కనక పోదాం' అన్నాడు.

లక్ష్మమ్మ అతని పాదాలముందు పడి, 'స్వామీ, మీరెవరో దేవతలుకాని మనుష్యులుగారు. మనుష్యులే ఐతే ఇలాంటి అసాధ్యమైన పని చెయ్యగలరా? మేమేదో నేరం చేసివుంటాం. మమ్మల్ని శిక్షించటానికే ఇలాగ వచ్చారుగాని...' అంది.

నవమిపురుషుడు ఆమెపైన జాలిదలిచి నిజరూపంలో ప్రత్యక్షమై, 'లక్ష్మమ్మా, నేరంచేసింది నువ్వుకాదు. నీభర్త. ఈ నవమినాడు ప్రయాణం తలపెట్టి నాకు కోపం తెప్పించాడు!' అన్నాడు. ఆమాట విన్న శంకరయ్యా నవమిపురుషుడికి సాష్టాంగపడి, 'బుద్ధివచ్చింది ప్రభూ! ఇంకెన్నడూ నవమిపూటా ప్రయాణం తలపెట్టను' అన్నాడు.

నవమిపురుషుడు శాంతించి, దంపతులిద్దర్నీ ఆశీర్వదించి, అదృశ్యుడయాడు.

అప్పుడు లక్ష్మమ్మ, భర్తతో 'ఇంక ప్రయాణం సాగిద్దాం, పదండి. మన కష్టాలు గట్టెక్కాయి'అంది. శంకరయ్యా వణుకుతో 'వద్దు. వెనక్కిపోదాం పద. రేపు దశమినాడు బయల్దేరివద్దాం' అని ఆమెతోసహా మళ్ళీ వాళ్ల పుట్టినింటికి చేరుకొన్నాడు.






శివుని ఢమరుకంలోనించి సంగీతం పుట్టింది. ఈ సంగీతాన్ని ప్రపంచంలో వ్యాపింప జేయాలని ఈశ్వరుడు సంకల్పించాడు. సాహిత్యానికి అధిదేవత సరస్వతి ఉండనే వున్నది కనుక, సంగీతానికికూడా పెద్దలను ఏర్పరచాలనే వుద్దేశంతో తుంబుర నారదులను పిలిపించి, వారికి సంగీతవిద్య నేర్పించాడు, పరమేశ్వరుడు.

ఆ ఇద్దరిలో తుంబురుడు దేవలోకంలోనూ,నారదుడుభూలోకంలోనూ సంచారం చేసి, సంగీతం వ్యాప్తిచేయాలని నిశ్చయం జరిగింది. ఆ ప్రకారం తుంబుర నారదులు స్వర్లోక, భూలోకాలలో సంగీతవిద్య ప్రచారం చేయబోయారు.

ఇంతలో—ఒకరోజున, 'తుంబుర నారదులలో ఎవరు ఎక్కువ పాటగాడు?' అని వారిలో వారికి పోటీపడింది. సాహిత్యానికి అధిదేవత ఐన సరస్వతివద్దకువెళ్ళి అడిగారు. వారిద్దరి పాటా విని, ఆమె స్పష్టంగా ఏమిచెప్పలేక, 'ఇద్దరూ గొప్ప పాటగాళ్లేనయ్యా!' అనేసింది.

సరాసరిపోయి, వాళ్లు ఈశ్వరుణ్ణే అడిగివేశారు. శివుడయినా ఏమీ నిర్ధారణగా చెప్పలేకపోయాడు, ఉభయులూ గొప్పవాళ్లే అని పొగడటంతప్ప వారిసమస్య తెగలేదు.

తరువాత వారు పార్వతివద్దకు వెళ్ళి ఎవరు ఎక్కువో చెప్పమన్నారు. పాట విన్నమీదట, పార్వతిదేవికూడా ఇద్దరిపాటా గొప్పగానే వున్నదన్నది. ఈ జవాబుతో వారికి తృప్తిగలగలేదు. అప్పుడు పార్వతి "అబ్బాయిలూ!—సంగీత విద్యలో నిధి ఐనటువంటి ఆంజనేయుడు ఇప్పుడు వింధ్య పర్వతాలమీద తపస్సు చేసుకొంటూ వున్నాడు. మీరుపోయి, మీ పాటలు అతనికి వినిపించారంటే మీ గొప్పదనం తేలిపోతుంది" అని సలహా చెప్పింది.

డి. ప్రభావతి - హైదరాబాద్ (దక్కన్)

వెంటనే తుంబుర, నారదులు పర్వతాలకుపోయి, తపస్సు చేసుకుంటూ వున్న హనుమంతుణ్ని లేపారు. లేపి, 'హనుమా!—నీవేదో సంగీతంలో నిధివట కాదా! మే మిద్దరమూ పాడి నీకు వినిపిస్తాం. శ్రద్ధగా విని, మాలో ఎవరు గొప్ప పాటగాడో చెప్పాలి' అని కోరారు.

హనుమంతుడు చిరునవ్వు నవ్వుతూ, "ఈపాటిదానికే పనికట్టుకువచ్చారా? సరే, ఏవి మీ వీణలు. ఇలాయివ్వండి!" అని అన్నాడు. తుంబురుడు తన 'కళావతి' అనే వీణనూ నారదుడు తన 'మహతి'నీ మారుతిచేతికి ఇచ్చారు.

వారిద్దరి పాటా విని, పరీక్షచేస్తాడుకదా అని తుంబుర, నారదులు కనిపెట్టుకు కూర్చున్నారు. వారిని పాడమనలేదు సరికదా, కొంచెంసేపటికల్లా ఆంజనేయుడు తనే పాడటం ప్రారంభించాడు. హనుమంతుడు సంగీతం ప్రారంభించగానే కొండలమీది శిలలు ద్రవించి కరిగి, కాలువగా ప్రవహింపసాగినై. తన చేతిలోఉన్న వీణలు రెండూ ఆంజనేయుడు ఆ కాలవ మధ్యకు విసిరేశాడు. ఇదంతా చూస్తూన్న తుంబుర నారదులు విస్తుపోయారు. మరి కొంచెంసేపటికి కాలువగా ప్రవహించిన శిలలన్నీ గడ్డకట్టి మామూలుగా మారిపోయినై. పాపం, తుంబుర నారదుల వీణలు ఆ రాళ్లలో ఇరుక్కుపోయినై.

వారితో ఆంజనేయుడు 'చేతనైతే మీ సంగీత ప్రభావం చూపి ఆ రాళ్ళను కరిగించండి. కరిగించి, మీ వీణలు మీరు తీసుకోండి!' అన్నాడు. వారికి చేతకాలేదు, తెల్లబోయారు.

అప్పుడు హనుమ మళ్ళీపాడి, రాళ్లుకరగించి, వీణలను వారికిచ్చివేస్తూ: 'ఇద్దరూ ఈశ్వరుడి ఆజ్ఞ నెరవేర్చటానికి పెద్దలే. సమానమైన విద్వత్తుకలవారే. కనుక పోటీ పడవద్దని హితవుచెప్పి పంపాడు.



1



2



# నేటి పాపలు  రేపటి పౌరులు



3



4

1. చి॥ లీలావతి, బెంగుళూరు
2. చి॥ విజయకుమార్, గుంటూరు
3. చి॥ జి. హేమసుందరరావు, విజయవాడ
4. చి॥ బాజ్జీ, త్యాగరాయనగర్

# అట్టమీంది బొమ్మ

భీముడు క్రమంగా పెరిగి పెద్దవాడయ్యాడు. అతనికి పదిహేనోయేడు వచ్చేసరికి తండ్రి అయిన పాండురాజు పోయాడు. అందుచేత శతశృంగంనుంచి పాండవులు ఐదుగురూ తల్లి కుంతితోసహా హస్తినాపురం చేరుకున్నారు.

అక్కడ పాండవులూ కౌరవులూ కలిసి ధృతరాష్ట్రుని పెద్దరికంక్రింద పోషింపబడుతున్నారు. కురు పాండవులందరూ కలిసి ఆడుకొనేవాళ్ళు. అందరిలోకీ భీముని బలపరాక్రమాలు అతీతంగా ఉంటూవుండేవి.



పదిమందీ కలిసిచెట్లెక్కి కోతి కొమ్మచ్చి ఆడుకోబోతే భీముడు తన భుజబలంవల్ల ఆ చెట్టును ఊపి పారవేసేవాడు. దెబ్బతో అది గజగజ వణికిపోయి, చెట్టుమీదివాళ్లంతా కిందపడేవాళ్ళు. ఇలాంటి పనులెన్నో సరదాకు చేసిచూపి, భీముడు తన పరాక్రమాన్ని ప్రదర్శించేవాడు. భీముడు ఇలా చేయటం కేవలమూ సరదాకోసమే కాని, దురుద్దేశం ఎంతమాత్రమూ వుండేదికాదు. ఐతే—అహంకారంతోనూ, అర్థంలేని పట్టుదలతోనూ నిండివున్న దుర్యోధనుడు భీముని బలపరాక్రమాలు చూచి సహించలేకపోయాడు. భీముడి పీడ ఎలా వదిలించుకోవడమా అని అదునుకోసం చూస్తూవున్నాడు. ఒకప్పుడు గంగానదితీరాన 'ప్రమాణకోటి' అనే స్థలమందు కురు పాండవులందరూ విడిదిచేసి క్రీడలుసల్పటానికి నిశ్చయమైంది. మత్తుపదార్థాలతో, పానీయాలతో విందులు ఆరగించి అందరూ నిద్రిస్తూవుండగా దుర్యోధనుడి పక్షంవాళ్లు భీముణ్ణి బలమైన తాళ్లతో కట్టి గంగలోకి తోసివేశారు. భీముడు ఆ కట్లను అవలీలగా తెంచేసుకుని యథాస్థానం చేరుకుని మళ్ళీ హాయిగా నిద్రిస్తూవున్నాడు.

అర్థరాత్రివేళ వచ్చి చూడగా భీముడు నిద్రిస్తునేవున్నాడు! ఇదిపని కాదని దుర్యోధనుడు మరి ఒక వ్యూహం పన్నాడు. అతని ప్రోత్సాహంవల్ల కొందరు, నిద్రిస్తున్న భీముని మీదికి క్రూరమైన నల్లత్రాచుపాములను తెచ్చి వదిలారు. కానైతే, ఎంత కాటువేసినా, భీముని శరీరంలోకి పాముల కోరలు దిగనేలేదు. కోరలే దిగనప్పుడు విషం ఎక్కేదేమిటి? మెలకువ రాగానే భీముడు అవి ఏమిటో చూడకనే పురుగుల్ని విదిలించినట్టుగా పాములను విదిలించి అవతల పారవేశాడు!

## అట్టచివరి బొమ్మ

ఇలావుండగా ఒక రోజున ఫాదుషావారి సమక్షానికి ఒక చిత్రమైన బంగీ తెచ్చి సమర్పించారు. ఆ బంగీని ఆత్రంతో విడగొట్టించి చూచేసరికి, అందులో ఒక అద్భుతమైన యాంత్రిక బుల్‌బుల్ పిట్ట కనబడింది. దాని వంటినిండా నవరత్న ఖచితమైన ఆభరణాలే! దాని మెడను ఒక చీటీ వేలాడుతున్నది. ఆచీటీలో "పర్షియా చక్రవర్తి బుల్‌బుల్‌కు మరి ఏదేశపు బుల్‌బుల్ అయినా తీసికట్టే!" అనివుంది.



యాంత్రిక బుల్‌బుల్ పిట్టను మర తిప్పేసరికల్లా అది సరిగ్గా అసలు బుల్‌బుల్ మోస్తరుగానే పాడింది. అప్పుడు ఫాదుషావారు రెండు పిట్టలనూ కలిపి ఒకే సారి పాడించమన్నారు. పాడించారు. కాని, వాటి పాట కలియలేదు. ఆ పిట్టలు రెండూ విడివిడిగా పాడినప్పుడు దేనికదే మనోహరంగా వినపడుతూవచ్చింది. కనుక, యాంత్రికపక్షిచేతనే అందరూ ఎక్కువగా పాడించి ఆనందింపసాగారు. యాంత్రిక పక్షి ఒక పాటను ముప్ఫైమూడుసారులు పాడినతరువాత, దానిని ఆగమని 'ఇప్పుడు అసలు బుల్‌బుల్ పాడాలి' అని అభిలాష వెల్లడించాడు ఫాదుషా. కాని, ఏదీ? అసలు బుల్‌బుల్ ఏదీ!!–ఫాదుషావారు నివ్వెరపోయారు. అది కృతజ్ఞతలేని పక్షి అన్నాడు పరివారానికి పెద్ద. 'పోనీ పోతే పోనీ, దానిని మించినపక్షి వచ్చిందికదా' అన్నారు అందరూ.

అప్పుడు ఆస్థానగాయకుడు యాంత్రిక పక్షిని మెచ్చుకొంటూ, 'అసలు బుల్‌బుల్ దాని యిష్టాన్ని అనుసరించి గానం చేసేది. ఇది అలాకాదు. మన యిష్టప్రకారం పాడమన్న పాటలే పాడుతోంది' అన్నాడు. ఆరామంలో ఫాదుషావారు యాంత్రిక పక్షి గానసభ ఏర్పాటుచేసి వినగా వినగా, ఒకమాట తోచింది. 'గానమంతా అసలు బుల్‌బుల్ పాడినట్టే వుంది. కానైతే ఏదో గాని చెప్పలేని చిన్నలోపం తోస్తున్నది' అని వారు తలిచారు.

ఫాదుషావారు ఉగ్రులై, అసలు బుల్‌బుల్‌ను రాజ్యంలోనించి వెళ్ళగొట్టించి వేసి, యాంత్రికపక్షిని అంతఃపుర గాయకిగా నియమించి శయ్యాగారంలో వారికి చేరువగా ఉండేటట్టు దానిని అమర్చించుకొన్నారు. ఈ విధంగా ఒక సంవత్సరం పాటు యాంత్రికపక్షి గానం విని ఫాదుషావారు ఆనందించారు.

# ఇంద్ర

## పొట్టిమనిషి పొడుగు కావటం

ఈ ఇంద్రజాలంతో ఏ వ్యక్తిఅయినా తాను సహజంగా ఉన్న పొడుగుకంటె ఎక్కువ పొడగరి కావచ్చు. ఆరడుగుల పొడుగు ఉండే వ్యక్తి ఏడెనిమిదడుగుల పొడుగు కావటం ఎంత ఆశ్చరంగా ఉంటుందో ఆలోచించిచూడండి. చెయ్యటం ఇది చాలా సుళువు. కిందనున్న బొమ్మచూస్తే ఇందులో కిటుకు ఇట్టే తెలిసిపోతుంది.

మొట్టమొదట ఐంద్రజాలికుడు తాను సహజంగా ధరించే కోటు—ఫాంట్‌లకన్న బాగా వదులుగా పొడుగ్గా ఉండే వాటిని ఒకజత మొద్దుగుడ్డతో కాని, లేదా ఉన్నిగుడ్డతో కాని కుట్టించుకోవటం మంచిది. ఫాంట్ కాళ్ళకు మాత్రం వెనుకవైపున కొంతభాగం కుట్టించకుండా వెనుకనుంచి మరొకరి కాళ్లుదూర్చటానికి వీలుగా ఉంచాలి. ఈ ఇంద్రజాలం చూపటానికి ఇద్దరువ్యక్తులు అవసరం. ఐంద్రజాలికుడు రంగస్థలంమీద ఒకటేబిల్‌నుఅమర్చి దానిమీద టేబిల్ క్లాత్ నేలకుజీరాడేట్లు పరిచివుంచాలి. ఈ టేబిల్ క్లాత్‌కు కూడా రెండు పెద్దపెద్ద చిరుగులు ఉండాలి.



ఆ చిరుగంతమేరా ఐంద్రజాలికుడి పేయగాని, రకరకాల

# జాలము

పూలు కాని దారాలతో కుట్టించి ఉంచుకోవాలి. ఈ టేబిల్ పైభాగాన్నే రంగస్థలంగా ఏర్పాటుచేసుకోవాలి. ఇంద్రజాలి కుడు పైన వివరించిన "కోటూ—ఫాంటూ" తొడుక్కొని అక్కడే నుంచుని మొదట సారిగా ప్రేక్షకులకు కన్పించాలి. అతడు ఒక పొడుగాటి కర్రను పట్టుకునివుండాలి. అతడు ఒకచేత్తో హాట్‌ను తీసి అందరికీ నమస్కారాలను తెలపాలి. అతడు టేబిల్ మీద కూర్చునివుంటాడు. అతడికాళ్ళురెండూ నేలమీదికి అనుతూవుంటాయి. అవి నిజంగా తన కాళ్లేనని ప్రేక్షకులకు నమ్మకంకలిగించటానికి ఒకటి రెండుసార్లు అటూ ఇటూ కదిలించాలి. ఇదిచూసి అందరూ ఆశ్చర్యపోతారు. ఇంద్రజాలికుడు టేబిల్ మీద కూర్చున్న మరుక్షణంలో అతడు ఎంతో పొడుగ్గా ధరించిన కోటూ—ఫాంటూ సరీగ్గా సరిపోయినట్లు కన్పిస్తాయి. టేబిల్ క్లాత్ నేలమీదికి జీరాడుతూ వుంటుంది కనుక దానిచాటునఉన్న రెండోవ్యక్తి ప్రేక్షకులకు కన్పించడు. అంతలో అతడు అంతపొడుగు ఎలా అయినాడా అనేది అందరకూ ఆశ్చర్యమే. టేబిల్ మీద కూర్చునివున్న ఇంద్రజాలికుడి కాళ్లు నిజానికి నేలమీదకు అనటంలేదు టేబిల్ క్లాత్ చాటున వున్న రెండోవ్యక్తి ఆ చిరుగుల సందునుంచి తన కాళ్లను, కుట్టించకుండా వదిలిన ఫాంట్ కాళ్లలోకి దూర్చేస్తాడన్నమాట. ప్రదర్శనం ప్రారంభించేటప్పుడూ—మళ్లీ అయిపోయాక కూడా రంగస్థలంమీద తెరలను ఉపయోగించటం చాలా అవసరం.

---

ఈ గారడినిగురించి పాఠకులు ఇంకావివరంగా తెలుసుకోదలిస్తే, 'చందమామ' పేరు ఉదహరిస్తూ సరాసరి ప్రొఫెసరుగారికి వ్రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీషుభాషలోనే వ్రాయాలి. ఇదిముఖ్యం.

అడ్రెసు : ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్
12/3/A, జమీర్‌లేన్, బాలీగంజ్ కలకత్తా - 19

ఇంతవరకు ప్రకటితమవుతూవచ్చిన 'అపూర్వసాధం'కథ ఈ అక్టోబరు నెల సంచికతో ముగిసిపోయింది.



## క్రొత్త సీరియల్

అద్భుత సంఘట్టనలతో, ఆశ్చర్యకరమైన సాహసకృత్యాలతో, ఉత్సాహంకొలిపే రసవత్తరధోరణిలో వెలువడబోతున్నది.

---

గతనెల చందమామ 12-వ పేజీలోని 'తప్పుపట్టండి' బొమ్మకు సమాధానాలు :



1. కెటిల్‌కు మూతకుమధ్య ఏర్పాటుఉండాలి.
2. గుర్రానికి గిట్టలు చీలి ఉండకూడదు.
3. ఆ కన్ను ఇక్కడ, ఈ కన్ను అక్కడా ఉండాలి.
4. 'వాటర్‌కాన్' మూతికి రంధ్రాలుండాలి.
5. రంపానికి పళ్ళు ఉండాలి.
6. పాళీ రెండుగా చీలిఉండాలి.
7. గొడ్డలికి కర్ర దూరే కన్నం ఉండాలి.
8. జూన్‌నెలకు 30 రోజులుమాత్రమే ఉండాలి.
9. కోటు బొత్తాములూ కాజాలూ సమంగా ఉండాలి.

## ఫొటో వ్యాఖ్యల పోటీ

నవంబరు ఫొటోల ఫలితాలు



నవంబరునెల చందమామలో ప్రచురింపబడే ఫొటోలకుగాను, మాకు వచ్చిన వ్యాఖ్యలలో ఉత్తమంగా వున్న ఈ దిగువ వ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

వ్యాఖ్యలు :

మొదటిఫొటో : 'అంటీ అంటని దూకు'

రెండవ ఫొటో : 'అందీ అందని ఆకు'

పంపినవారు :

కె. రామలక్ష్మి - బెల్‌గామ్

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపినవారి పేరుతోసహా నవంబరు చందమామ ఫొటోల దిగువన ప్రచురిస్తాము. బహుమతి మొత్తం రూ. 10/- నవంబరు సంచిక వెలువడిన వెంటనే పంపబడుతుంది.



## డిశంబరు నెలలో

ప్రచురింపబడే ఫొటోల నమూనాలు వివరాలతోసహా ప్రక్కపేజీలో చూడండి

---

ఒక ముఖ్యసూచన :

మీరు పంపదలచుకున్న వ్యాఖ్యలు కార్డుపైననే వ్రాసిపంపాలి. కొందరు కాగితంపైన వ్రాసి కవరులో పంపుతున్నారు. ఇలాంటివి పరిశీలింపబడవు.

# ఫొటో వ్యాఖ్యల పోటీ

డిశంబరు 1952 :: బహుమానం రూ. 10/-





డిశంబరు సంచికలో వచ్చే ఫోటోలు రెండూ పైన చూడండి.
వీటికి సరియైన వ్యాఖ్యలు కావాలి. వివరాలు యివి :—

1. వ్యాఖ్య ఫోటోకు సరిపడేటట్లు వుండాలి.
2. ముచ్చటైన ఒక్కమాటలోగానీ, రెండు మూడు మాటలుగల ఒక చిన్ని వాక్యంలో గానీ వ్యాఖ్య ఉండవచ్చు.
3. అన్నిటికన్న ముఖ్య విషయం : మొదటి ఫోటోకూ, రెండవ ఫోటోకూ కూర్చేవ్యాఖ్యలు రెండూ ఒకదానికొకటి సంబంధించివుండాలి.
4. ఒక్కొక్కరు ఒక్కొక్క సెట్టు వ్యాఖ్యలకంటే ఎక్కువ పంపకూడదు.
5. ఒక కార్డుపైన మీ వ్యాఖ్య, పూర్తిపేరూ, విలాసమూ వ్రాసి, మాకు పంపాలి.
6. అక్టోబరు 15-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ఆ తర్వాత చేరినవ్యాఖ్యలు పరిశీలించబడవు.
7. మాకు చేరిన వ్యాఖ్యలలోకెల్లా అత్యుత్తమంగా వున్న సెట్టుకు (అనగా రెండువ్యాఖ్యలకు కలిపి) రూ. 10/– బహుమతి ఇవ్వబడుతుంది.

వ్యాఖ్యలు పంపవలసిన అడ్రసు :

ఫొటో వ్యాఖ్యల పోటీ :

## చందమామ పబ్లికేషన్స్

వడపలని పోస్టు :: మదరాసు - 26.

# విజయ

## వారి చిత్రాలు

## వినోదానికి

## విజ్ఞానానికి

## సాటిలేనివి




**VIJAYA PRODUCTIONS LTD.**

**Lessees of Vauhini Studios**

**MADRAS - 26**

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras-26, and Published by him from Chandamama Publications, Madras 26. Controlling Editor : SRI CHAKRAPANI

Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఉదరనిమిత్తం

పంపినవారు :
సబ్నివీసు శ్రీనివాసరావు, కర్నూలు

